# విచిత్ర పుష్పం

మన దేశంలో ఈశాన్య ప్రాంతాన గల మాణిక్యపురి రాజ్యంలో వసంతరుతువుకు స్వాగతం పలికే వసంతోత్సవాలు యేటా నెల రోజుల పాటు జరిగేవి. వసంతరుతువు రాగానే కొండల మధ్య ఉన్న మాణిక్యపురి రాజ్యం—కొత్త వెలుగునూ, చెట్టూచేమలతో నూతన శోభనూ సంతరించుకుంటుంది. అందుకే కొన్ని వేల సంవత్సరాల నాడు అక్కడ వసంతోత్సవాలను కోలాహలంగా జరుపుకునేవారు.

మాణిక్యపురి రాజు ప్రతాపవర్మ ఆదర్శ ప్రభువుగా కీర్తి గాంచాడు. తండ్రి పుష్యవర్మ కోరిక మేరకు ప్రతాపవర్మ అతి పిన్న వయసులోనే మాణిక్యపురి సింహాసనాన్ని అధిష్ఠించి, ప్రజారంజకంగా రాజ్యపాలన చేసి, తండ్రికి ఆనందం కలిగించాడు. ఆయన మెప్పుపొందాడు.

రాజు ప్రతాపవర్మ తండ్రికి తగిన వారసుడుగా అనతికాలం లోనే ప్రజల ఆదరాభిమానాలకు పాత్రుడయ్యాడు. తన రాజ్యంలో శాంతి భద్రతలు నెలకొల్పడంతో పాటు ఇరుగు పొరుగు రాజ్యాలతో సత్సం బంధాలు నెలకొల్పాడు. ఆ కారణంగా ప్రజలు యుద్ధభయంలేకుండా సుఖసంతోషాలతో జీవించసాగారు.

దేశంలో శాంతి భద్రతలకు కొరత లేదు గనక, అవకాశం కలిగినప్పుడల్లా ప్రజలు వినోద కార్యక్రమాల పట్ల, ఆసక్తి కనబరచ సాగారు. ముఖ్యంగా యేటా జరిగే వసంతోత్సవాలలో స్త్రీలూ, పురుషులూ; పిల్లలూ,







పెద్దలూ అమితోత్సాహంతో పాలుపంచుకునేవారు.

ప్రతాపవర్మ మాణిక్యపురి సింహాసనాన్ని అధిష్ఠించి ఇరవై అయిదు సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా, ఆ యేడు వసంతోత్సవాలను మరింత ఘనంగా జరపడానికి ఏర్పాట్లు జరిగాయి. కేవలం క్రీడల పోటీలే కాకుండా సంగీతం, సాహిత్యం, నాట్యం, చిత్రకళ మొదలైన లలిత కళలన్నిటిలోనూ పోటీలు ఏర్పాటుచేశారు. ప్రత్యేక అంశంగా కవులూ, పండితులూ పాల్గొనే పండిత సదస్సుకు కూడా ఏర్పాటు చేశారు. ఈ ఉత్సవాలలోపాలుపంచుకోవడానికి ఇరుగు పొరుగు రాజ్యాలలోని క్రీడాకారులకూ, కళాకారులకూ పండితులకూ, కవులకూ కూడా ఆహ్వానాలు పంపారు.

మొదట ఆటల పోటీలు ఆరంభమయ్యాయి. ఆ పోటీలలో మొదటి నుంచీ ఒక కొండజాతి యువకుడు ఎక్కువ పోటీలలో విజయం సాధించి అందరి దృష్టినీ ఆకర్షించాడు. మొదట మల్లయుద్ధంలో సునాయాసంగా గెలుపొందాడు. ఆ తరవాత పేముకర్రలతో ఆడే 'కుంజే' ఆటలోనూ అతడే గెలుపొందాడు. ఆ సంవత్సరం కొత్తగా ఒక క్రీడాపోటీని ప్రవేశపెట్టారు. ఒక దృఢమైన ఎండు కొబ్బరికాయను నేలమీద వేసి, గుర్రంమీద వస్తూ చేతిలోని కర్రతో బంతిలాంటి ఆ కొబ్బరికాయను కొట్టాలి. ఆ ఆటపేరు 'లక్పి'. ఆ నూతన క్రీడ పోటీలోనూ ఆ యువకుడు తన బృందానికి నాయకత్వం వహించి, అతి లాఘవంగా గుర్రం మీద స్వారీ చేస్తూ, ఎంతో నేర్పుతో బంతిని కొట్టి విజయం సాధించాడు. దానిని చూసినవాళ్ళు హర్షధ్వానాలు చేశారు.

క్రీడాపోటీలు పూర్తయ్యాక బహుమతీ ప్రదానోత్సవం జరిగింది. రాజు ప్రతాపవర్మ స్వయంగా వచ్చి గెలుపొందినవారికి బహుమతులు అందజేశాడు. ఎక్కువ బహుమతులు అందుకున్న ఆ కొండజాతి యువకుడి కేసి ఆయన ఆప్యాయంగా చూస్తూ, "నీ పేరేమిటి?" అని అడిగాడు.







రాణి ప్రియంవదను సమీపించి, ఆమెకు నమస్కరించి, "తమకు పువ్వులంటే చాలా ఇష్టం అని తెలిసింది. ఇవి మా ప్రాంతంలో పూచిన అపూర్వమైన పుష్పాలు. దయతో స్వీకరించండి!" అంటూ పుష్పగుచ్ఛాన్ని అందించి,వేదికనుంచి కిందికి దిగివెళ్ళాడు.

యువరాణి ప్రియంవద పుష్పగుచ్ఛాన్ని చిరునవ్వుతో తీసుకొని ఆ పువ్వులను ఆనందంగా చూసి, తండ్రి వైపు తిరిగి, "నాన్నా, ఇంతటి అందమైన పువ్వులను ఇంతకు ముందెన్నడూ చూడలేదు. ఈ పూలు పూచే మొక్కలు మన ఉద్యాన వనంలో కూడా లేవు!" అన్నది.

అవును అన్నట్టు రాజు తలపంకించాడు.

కొంతసేపటికి బహుమతీ ప్రదానోత్సవం ముగిసింది. అప్పుడు రాజు ప్రజల నుద్దేశించి ఇలా అన్నాడు: "ప్రియమైన ప్రజలారా! ఈ యేడు వసంతోత్సవాలను ఇంత ఘనంగా నిర్వహించినందుకు నాకెంతో ఆనందంగా ఉన్నది. ముఖ్యంగా మీరు నిర్వహించిన క్రీడా పోటీలు ప్రశంసించ తగ్గవి. వాటిలో పాల్గొన్న కొండజాతి యువకులు ప్రదర్శించిన నేర్పు, వాళ్ళ నాయకుడు ఉత్తుంగుడుచూపిన నైపుణ్యం కొనియాడ తగినవి. అందుకే ఈ సంవత్సరం ప్రారంభించిన నూతన క్రీడకు ఆ కొండజాతి ప్రజలు నివసించే శృంగ్మాయ్ ప్రాంతం పేరు మీదగా 'మాయ్‌క్రీడ' అని

"నా పేరు ఉత్తుంగుడు, ప్రభూ!" అని అతడు వినయంగా సమాధానం చెప్పి, తల వెనకకు తిప్పి, తనతో వచ్చిన మిత్ర బృందాన్ని రాజుకు చూపుతూ, "వీళ్ళందరూ నాతో వచ్చిన మిత్రులు. మేము శృంగ్మాయ్ కొండలలోని ఉత్తుంగ తెగకు చెందిన వాళ్ళం, ప్రభూ! తమ రాజ్యంలో జరిగే ఈ పోటీలలో ఈ సంవత్సరమే మొట్టమొదటిసారిగా పాల్గొన్నాము, ప్రభూ!" అన్నాడు.

రాజు మందహాసం చేశాడు.

ఉత్తుంగుడు వెనక్కు తిరిగి, తన మిత్రుడొకడి చేతిలోని పుష్పగుచ్ఛాన్ని తీసుకుని, చకచకా మెట్లెక్కి వేదిక మీద ఉన్న యువ





నామకరణం చేస్తున్నాను. అంతే కాదు, ఈ సంవత్సరం నుంచి మన సైన్యంలో ఈ కొండజాతి యువకులకు కూడా స్థానం కల్పిస్తున్నాను. రేపు వసంతోత్సవం ఆఖరి రోజు గనక, ప్రతియేడులాగా రేపు కూడా రాజప్రాసాదం తలుపులు తెరిచే ఉంటాయి. మీరు ఎవరు రావాలన్నా నిరభ్యంతరంగా రాజప్రాసాదానికి రావచ్చు. రాజకుటుంబంతో హాయిగా కలిసి మెలిసి తిరగవచ్చు. భైరంబీమాత మనల్ని రక్షించుగాక!"



ఆ మాటలు విని అక్కడ చేరిన వేలాది ప్రజలు చేసిన, "రాజు ప్రతాపవర్మ వర్ధిల్లాలి! యువరాణి ప్రియంవద వర్ధిల్లాలి!" అన్న నినాదాలు మిన్నుముట్టాయి.

రాజూ, యువరాణీ వేరు వేరు రథాలలో రాజప్రాసాదానికి బయలుదేరారు. రాజు రథంలో, ఆయనతోపాటు సేనానాయకుడు గంభీరసింహుడు, యువరాణి రథంలో ఆమె వెంట ఇద్దరు చెలికత్తెలూ ఉన్నారు. నగర ప్రధాన వీధులలో రథాలు వెళుతూ ఉంటే వీధికి ఇరువైపులా ప్రజలు బారులు తీరి నిలబడి చేతులు జోడించి వారికి శుభాకాంక్షలు తెలియజేశారు.

రాజప్రాసాదాన్ని చేరగానే, యువరాణి ప్రియంవద చెలికత్తెల చేత, పూలగుచ్ఛాలను అమర్చే పెద్ద తొట్టెను తీసుకురమ్మని, ఉత్తుంగుడు ఇచ్చిన పుష్పాలను తీసి అందులో స్వయంగా అమర్చింది. అందమైన ఆ పుష్పాలకు, అక్కడ చేరగానే మరింత అందం రావడం చూసి యువరాణి ఆనందంతో పొంగిపోయింది.

మరునాడు తెల్లవారగానే నగరం నాలుగు వైపుల నుంచీ ప్రజలు రాజప్రాసాదంకేసి తండోపతండాలుగా రాసాగారు. రాజు, యువరాణి, రాజబంధువులు మరికొందరు మేడ మీద నిలబడి చేతులు ఊపుతూ ప్రజల శుభాకాంక్షలు స్వీకరించారు.

యువతీ యువకులు ఒకరిమీద ఒకరు రంగు రంగుల నీళ్లూ, పొడులూ చల్లుకుంటూ, ఆనందంతో పాటలు పాడుతూ, నృత్యం చేస్తూ ఆరోజంతా సంతోషంగా గడిపారు.



సాయంకాలానికి ఉత్సవాల హడావుడి తగ్గిన తరవాత, రాజు, సేనాధిపతిని పిలిచి, "మొన్న శృంగ్మాయ్ కొండల ప్రాంతం నుంచి వచ్చిన ఉత్తుంగుడు, యువరాణికి ఇచ్చిన పుష్పాలను నువ్వు చూశావు కదా! ఆ పూల మొక్కలను మన ఉద్యానవనంలో నాటించాలని ప్రియంవద కోరుతున్నది. కాబట్టి మన సైన్యంలోని ఇద్దరు సమర్థులైన యువకులను శృంగ్మాయ్ కొండలకు పంపి, ఆ పూలమొక్కలను తెచ్చే ఏర్పాటు చెయ్యి. అక్కడ వాళ్ళకు ఉత్తుంగుడు సాయపడ గలడు. అక్కడికి వెళ్ళే వారిని మొదట ఆ యువకుణ్ణి చూడమని చెప్పు," అన్నాడు.

"చిత్తం, మహారాజా!" అని అక్కడి నుంచి వెళ్ళిన సేనాధిపతి గంభీరసింహుడు, కొంత సేపటికి దృఢకాయులైన ఇద్దరు సైనికులను వెంట బెట్టుకుని వచ్చాడు. వారికి అతడు యువరాణి భవనంలో ఉన్న పువ్వులను చూపి రాజు కోరికను తెలియ జేశాడు.

ఆ పువ్వులను చూసి సైనికులు కూడా ఎంతో సంతోషించారు. "ఈ పువ్వులు చాలా అందమైనవి. వాటిని గుర్తించడం చాలా సులభం," అని వాళ్ళు సేనాధిపతితో చెప్పి, యువరాణికేసి తిరిగి, "మీరు కోరిన ఈ పూలమొక్కలతో తిరిగి వస్తాము. మాకు సెలవివ్వండి, యువరాణీ!" అని నమస్కరించి, అక్కడి నుంచి వెళ్ళిపోయారు.

సైనికులు శృంగ్మాయ్ కొండలకు వెళ్ళి ఒకవారం రోజులు గడిచి పోయింది. కాని వాళ్ళ జాడలేదు. వాళ్ళు ఇంకా ఎందుకు తిరిగి రాలేదా అని యువరాణి ఆలోచిస్తూన్న కొద్దీ ఆమెలో ఓర్పు నశించ సాగింది. అయితే ఉత్తంగుడు ఇచ్చిన పువ్వులు, పదిరోజులయినా ఇంకా ఏ మాత్రం వాడకుండా అప్పుడే పూచినట్టున్నాయి. యువరాణికి అది కాస్త ఉపశమనం కలిగించ సాగింది.

ఇలా మూడు వారాలు గడిచాక పూల మొక్కల కోసం వెళ్ళిన ఇద్దరు సైనికులు మరిన్ని పువ్వులతో రాజధానికి తిరిగి వచ్చారు. సేనాధిపతి గంభీరసింహుడు





వారిద్దరినీ వెంటబెట్టుకుని రాజప్రాసాదా నికి వెళ్ళాడు. అక్కడ రాజూ, యువరాణీ, వాళ్ళ రాకకోసం ఎదురు చూస్తున్నారు. గంభీరసింహుడు వాళ్ళు తెచ్చిన పువ్వులను యువరాణికి ఇచ్చి, రాజుతో, "శృంగ్మాయ్ కొండలలో వీళ్ళకు ప్రస్తుతం ఈ పువ్వులు మాత్రమే లభించాయట. మొక్కలు లభ్యం కాలేదట!" అన్నాడు.



ఎందుకు అన్నట్టు రాజు ఆ సైనికులకేసి చూశాడు. అప్పుడు వాళ్ళలో ఒకడు, "మహా ప్రభూ! తమ అజ్ఞానుసారం మేము వారం రోజులు ప్రయాణం చేసి అతికష్టం మీద శృంగ్మాయ్ కొండలను చేరుకున్నాము. ఉత్తుంగుణ్ణి కలుసుకున్నాము. ఆ యువ కుడు మమ్మల్ని చూసి ఎంతో సంతో షించాడు. మమ్మల్ని వెంట బెట్టుకుని అక్కడికి చాలా దూరంలో ఉన్న కొండల మీదికి తీసుకు వెళ్ళాడు. ఆ కొండల మధ్య చిన్న చిన్న పొదలుగా వెదుళ్ళలాంటి మొక్కలు ఆకాశాన్నంటుతూ ఉన్నాయి. ఆ చెట్ల చిటారు కొమ్మలలో మెరుపుల్లా మెరుస్తూ ఈ పువ్వులు కనిపించాయి. అక్కడి వాళ్ళు వాటిని మెరుపుపూలనీ, వంద సంవత్సరాలకు ఒకసారి పూయడం వల్ల 'శతాబ్దిక' అనీ పిలుస్తారట. వాళ్ళు కూడా వాటిని ఇప్పుడే మొట్టమొదట చూశా రట. పూవులు పూచిన రెండేళ్ళ తరవాత వీటి మొక్కలు అక్కడక్కడ గుంపులు గుంపులుగా, పుట్టుకొస్తాయనీ, అవి పెరిగి పెద్దవై పూయడానికి వంద సంవత్సరాలు పడుతుందనీ, అక్కడి పెద్దలు చెప్పారు. యువరాణికి ఆశాభంగం కలగకూడదని ఒక చెట్టును నరికించి, వాటి పూలను తెచ్చాము, ప్రభూ!" అన్నాడు.

సైనికుడి మాటలను శ్రద్ధగా ఆలకించిన రాజు, "చాలా వింతగా ఉన్నది. సరే మరొక రెండేళ్ళలో వాటి మొక్కలు మొలిచేప్పుడు వాటిని తెచ్చి, ఉద్యానవనంలో నాటిద్దాం," అన్నాడు.

"ఆ మొక్కలు పూయడానికి ఇంకా నూరేళ్ళు పడుతుందా? అలా అయితే ఆ మొక్కలు పూయడం చూసే అదృష్టం నాకు





లేదన్నమాట!" అన్నది యువరాణి ఎంతో నిరుత్సాహంగా.

రాజు సైనికులతో, "ఇంత శ్రమపడి ఆ పూలను తెచ్చినందుకు మీకు ధన్య వాదాలు!" అని, సేనాధిపతి వైపు తిరిగి, "వీరిని ఉచిత రీతిలో సత్కరించి పంపు," అన్నాడు.

"చిత్తం, మహారాజా!"అని అక్కడి నుంచి బయలుదేరాడు సేనాధిపతి. సైనికులు ఆయన వెంట నడిచారు.

సైనికులు శృంగ్మాయ్ కొండలకు వెళ్ళి, అక్కడ శతాబ్దిక గురించి సేకరించుకుని వచ్చిన విషయాలు, క్రమంగా ప్రజల మధ్య వ్యాపించాయి. అది ఆ నోటా ఆ నోటా పడి, వయోవృద్ధుడైన రాజగురువు గౌరీనాథుడి చెవిలో పడింది. 'శతాబ్దిక' అన్నమాట విన గానే అతడు ఉలిక్కి పడ్డాడు. రాజగురువు విద్యాధికుడు. రాజకుటుంబం యోగ క్షేమాల పట్ల ఎంతో శ్రద్ధగలవాడు. వెంటనే అతడు తన వద్ద ఉన్న తాళపత్ర గ్రంథా లన్నిటినీ తిరగ వేశాడు. ఒక నిర్ణయానికి వచ్చి, తాను వస్తున్నట్టు రాజుగారికి ఒక భటుడి ద్వారా కబురు పంపాడు.

రాజగురువు వస్తున్నాడన్న వార్త వినగానే, రాజు ఈ అపరాత్రి వేళ ఆయన రావడానికి కారణం ఏమై ఉంటుందా అని ఆలోచిస్తూ, ఆయన రాకకోసం ఎదురు చూడసాగాడు. రాజగురువు రాజప్రాసాదంలో అడుగు పెట్టగానే, రాజు ఎదురు వెళ్ళి ఆయనకు పాదాభివందనం చేసి, గౌరవంగా లోపలికి తీసుకువెళ్ళాడు. ఆయన ఉచితాసనంలో కూర్చున్న తరవాత రాజు, "గురుదేవా! తమ రాకకు కారణం..." అనగానే, "ముఖ్యమై నదే, మహారాజా!" అన్నాడు రాజగురువు.

ఏమిటి అన్నట్టు చూశాడు రాజు.

"శతాబ్దిక గురించి విన్నాను. ఆ పువ్వు పూయడం రాజకుటుంబానికీ, రాజ్యానికీ అశుభాన్ని సూచిస్తుంది, మహారాజా!" అన్నాడు రాజగురువు.

"అశుభాన్ని సూచిస్తుందా?" అన్నాడు రాజు విస్మయంతో తన చెవులను తానే నమ్మలేనట్టు. —(ఇంకావుంది)





# విచిత్ర పుష్పం

## 2

[మాణిక్యపురిలో జరిగిన వసంతోత్సవాల సందర్భంగా ఏర్పాటు చేసిన పోటీలలో పాల్గొన్న ఉత్తుంగుడనే కొండజాతి యువకుడు యువరాణి ప్రియంవదకు ఒక పుష్పగుచ్ఛాన్ని ఇచ్చాడు. యువరాణి కోరిక ప్రకారం, రాజు ప్రతాపవర్మ ఆ పువ్వులు పూచే మొక్కలను తెమ్మని భటులను పంపాడు. వాళ్ళు పువ్వులతో మాత్రం తిరిగి వచ్చారు. రాజగురువు గౌరీనాథుడు ఆ పువ్వులు అశుభసూచకాలని రాజుకు చెప్పాడు.— తరవాత]

“అంతటి అందమైన పరిమళ పుష్పాలు అశుభాన్ని ఎందుకు సూచిస్తాయి? అవి పూయడం అశుభం ఎలా అవుతుంది? అర్థం కావడం లేదు, గురుదేవా!” అన్నాడు రాజు ప్రతాపవర్మ.

“ఆ విషయం తరవాత చెబుతాను. ఆ పుష్పాలను సైనికులు ఇద్దరు తీసుకువచ్చినట్టు విన్నాను. సైనికులు ఎందుకు అవి పూచే ఈశాన్య సరిహద్దులకు వెళ్ళారు? అక్కడ కలహాలు చెలరేగ లేదు కదా?” అని అడిగాడు రాజగురువు గౌరీనాథుడు.

“లేదు, గురుదేవా! తమ ఆశీర్వాద బలంతో దేశమంతటా ప్రజలు సుఖశాంతులతో క్షేమంగా ఉన్నారు!” అని రాజు ‘శతాబ్దిక’ గురించి సైనికులు చెప్పిన విషయాలను క్లుప్తంగా తెలియజెప్పాడు. అంతా విన్న రాజగురువు, “ఇప్పుడా పుష్పాలు ఎక్కడ ఉన్నాయి?” అని అడిగాడు.







"యువరాణి భవనంలో ఉన్నాయి. ఇన్ని రోజులు అయినప్పటికీ అవి వాడకుండా ఇంకా పరిమళాలు విరజిమ్ముతూనే ఉన్నాయి!" అన్నాడు రాజు.

"వాటిని వెంటనే అక్కడి నుంచి తొలగించండి. అవి రాజభవనంలో ఉన్నట్టయితే, రాజకుటుంబానికి అరిష్టదాయకం అని యువరాణికి నామాటగా తెలియజేయండి," అన్నాడు రాజగురువు.

"మీ ఆజ్ఞను శిరసావహిస్తాను, గురుదేవా!" అని రాజు ఒక్క క్షణం మౌనం వహించి, "అయితే, ఆ పుష్పాలు ఎందుకు అశుభ సూచకాలని తమరు భావిస్తున్నారో చెబితేవినాలని ఉన్నది. యువరాణి ప్రియంవద ఆ పువ్వులను ప్రాణ సమానంగా భావిస్తున్నది. కాబట్టి వాటిని గురించిన అసలు సంగతులు ఆమెవినడంశ్రేయస్కరమని భావిస్తున్నాను. పిలువమంటారా?" అని అడిగాడు.

సరే అన్నట్టు తలపంకించాడు రాజగురువు.

యువరాణి రాగానే ఆమె రాజగురువుకు పాదాభివందనం చేసింది. రాజగురువు ఆమెను ఆశీర్వదించి, కూర్చోమని పక్కనున్న ఆసనాన్ని చూపాడు.

ఆమె కూర్చున్న తరవాత, తనను పిలిచిన కారణం ఏమిటి? అన్నట్టు తండ్రిని చూసింది.

" 'శతాబ్దిక' అనే ఆ విచిత్ర పుష్పాలను గురించి కొన్ని ముఖ్యమైన విషయాలను తెలియజేయడానికి రాజగురువు వచ్చారు. ఆయన చెప్పే విషయాలు నీకు తెలియడం అవసరం. కాబట్టి, నిన్నూ రమ్మన్నాను," అన్నాడు రాజు కుమార్తెతో.

"అలాగా!" అన్నట్టు ఆమె రాజగురువుకేసి చూసింది.

రాజగురువు కొంతసేపు మౌనంగా ఆలోచిస్తూ గడిపి, ఆతరవాత ఇలా చెప్పసాగాడు:

"ఒకానొకప్పుడు వింత పరిమళాలు విరజిమ్మే ఈ విచిత్ర పుష్పాలు, అన్ని పువ్వుల లాగే ఏడాదికొకసారి పూచేవి. ఒక్కసారి పూచాయంటే రోజుల తరబడి వాడకుండా ఉండేవి. కొన్ని వందల సంవత్సరాలకు





పూర్వం మీ వంశానికి చెందిన చంద్ర కాంతుడు అనేరాజు మాణిక్యపురి రాజ్యాన్ని పరిపాలించాడు. ఆయన ధర్మప్రభువుగా, సాహస వీరుడుగా పేరు గాంచాడు. ఆయ నకు చంద్రకేతు అనే సోదరుడు ఉండే వాడు. వాడు అన్ని విధాలా అన్నకు విరుద్ధ మైనవాడు. రాజ్యనిర్వహణాభారంలో అన్నకు సాయపడడం మాని, హాని చేయడానికి పూనుకున్నాడు. వాడు దేశదిమ్మరి అయి ఊరూరూ తిరిగి ఆఖరికి, రాజ్యానికి ఉత్తర సరిహద్దులలో వున్న కొండ ప్రాంతాన్ని చేరాడు. అక్కడ అతడు కొండజాతి ప్రజ లతో పరిచయం చేసుకున్నాడు. వారిలో నాగాంబి అనే వాడికి మంత్ర తంత్రాలు తెలుసు. వాడితో స్నేహం చేసి వాడి నుంచి కొన్ని తంత్ర విద్యలు నేర్చుకున్నాడు చంద్ర కేతు. ఒకనాడు ఆ కోయవాడు విచిత్రమైన కొన్ని పువ్వులను కోసి, సలసల మరుగు తున్న నీళ్ళలో వేయడం చూశాడు. కోయ వాడు ఆ నీళ్ళను రోజూ కొంతసేపు మళ్ళీ మళ్ళీ కాచి ఒక విధమైన సువాసనతో ఉన్న తైలం తీశాడు. ఆ తైలాన్ని ఎవరి పైనైనా చల్లినట్టయితే, వాళ్ళు తమకు వశమై, తాము చెప్పినట్టు నడుచుకుంటారని కోయవాడు చంద్రకేతుకు చెప్పాడు. చంద్ర కేతు అమితోత్సాహంతో ఆ పువ్వులను తీసు కుని మాణిక్యపురి చేరి, ఒక రహస్య ప్రదేశంలో కోయవాడు చేసినట్టు ఆ పువ్వు



లను నీళ్ళలో వేసి కాచి, మరి కొన్నాళ్ళకు విచిత్రపుష్పతైలం తయారుచేశాడు. మొదట ఆ తైలాన్ని ఎవరైనా మామూలు మనుషుల మీద వాడి, వారి ప్రవర్తనను రూఢి చేసు కుని, ఆ తరవాత దానిని రాజు మీద ప్రయోగించి, ఆయనను తన చెప్పుచేత లలో ఉంచుకుని, తాను మాణిక్యపురి సింహాసనం అధిష్ఠించాలని ఆ దుర్మార్గుడు పథకం వేశాడు."

ఇంతవరకు చెప్పిన రాజగురువు, "అతని పథకం నెరవేరలేదు కదా?" అని యువరాణి అడగడంతో కొంతసేపు ఆగి, "లేదు, యువరాణీ! అతని కుటిల పథకం నెరవేరలేదు. ఆ సంగతే చెబుతున్నాను,







శ్రద్ధగా విను," అంటూ మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు:

"ఆ సమయంలో కులశ్రేష్ఠుడనే పండితుడు భైరంభీమాత ఆలయానికి ప్రధాన పూజారిగా ఉండేవాడు. ఆయన కొక అందమైన కుమార్తె ఉండేది; పేరు భాగ్యశ్రీ. ఆమెను చూడగానే చంద్రకేతు ఆమె అందానికిముగ్ధుడయ్యాడు. ఆమె ఆలయపూజారి కుమార్తె అన్న సంగతి తెలియక, తాను తయారుచేసిన పుష్పతైలాన్ని ప్రయోగించి ఆమె మనసును తన వైపు మళ్ళించుకోవాలని ఆశించాడు. ఒకనాడామె తన చెలికత్తెలతో కలిసి, దాపులనున్న నదిలో స్నానం చేసి, గుడికి రావడం చూసి, చంద్రకేతు ఒక చెట్టుచాటున పొంచి వుండి, ఆమె మీద తాను తయారుచేసిన తైలం చల్లాడు. మరుక్షణమే భాగ్యశ్రీ దిక్కులు అదిరే విధంగా కేకలు వేస్తూ అటు ఇటూ పరిగెత్త సాగింది. వెంటనున్న చెలికత్తెలు ఆమెకు ఏమయిందో గ్రహించలేక ఆమెను పట్టుకోబోయారు. ఆ విషయం పూజారికి చెప్పడానికి కొందరు గుడి లోపలికి వెళ్ళారు. ఇంకా కొందరు చేతిలో ఏదో పాత్ర, ఆకులతో పరిగెత్తుతున్న చంద్రకేతును పట్టుకోమనిఅరవడంతో, దారినవెళుతున్నవాళ్ళు అతన్ని పట్టుకుని గుడికేసి లాక్కు వెళ్ళారు.

పూజా సమయం సమీపించడంతో, దేవతా విగ్రహ అలంకరణలో నిమగ్నుడై వున్న పూజారి కులశ్రేష్ఠుడు, స్త్రీల ఆర్తనాదాలు విని, వెలుపలికి వచ్చి, అక్కడి దృశ్యం చూసి, ఒక్క క్షణం దిగ్భ్రాంతి చెందాడు. ఆయన కూతురును సమీపించి ఆమె భుజాన్ని పట్టి కుదుపుతూ, "భాగ్యశ్రీ! ఏమయింది, తల్లీ?" అని అడిగాడు.

భాగ్యశ్రీ నోటి నుంచి మాటరాలేదు. ఆమె కొంతసేపు అటూఇటూ దిక్కులు చూసి సొమ్మసిల్లి పడిపోయింది! ఆమెను పట్టుకుని ఉన్న చెలికత్తెలు, "నదికి వెళ్ళి వస్తూన్న భాగ్యశ్రీ మీద, ఆ మనిషి ఏదో చల్లాడు. ఆ క్షణం నుంచి ఈమె ఇలా వెర్రెత్తిన దానిలా ప్రవర్తిస్తున్నది," అంటూ జనం మధ్య ఉన్న చంద్రకేతును చూపారు.





పూజారి అతడికేసి నాలుగడుగులు వేసి, "ఎవరు నువ్వు? నా కుమార్తెను ఏం చేశావు?" అని అడిగాడు కోపంగా.

"మహాత్మా! ఆమె మీ కుమార్తె అని తెలియక ఈ అపరాధం జరిగిపోయింది. కోయవాడు చెప్పిన ప్రకారం కొన్ని విచిత్ర పుష్పాలను సేకరించి, తైలం తయారు చేశాను. ఆ తైల ప్రభావాన్ని శోధించి చూడడానికి, దానిని తమ కుమార్తె అని తెలియక ఆ యువతిపై చల్లాను అంతే! మరొక పాపం ఎరుగను, నన్ను..." అని ఇంకేదో చెప్పబోయాడు చంద్రకేతు.

అయినా, పూజారి ఆ మాటలను పట్టించుకోకుండా గబగబా ఆలయం లోపలికి వెళ్ళాడు. దేవీ విగ్రహం మెడలో ఉన్న పుష్పహారాన్ని తీసుకుని వెలుపలికి వచ్చి, "మాతా, భైరంబీ! నిన్నే దిక్కుగా భావించి, లోకక్షేమం కోసం నిన్ను పూజిస్తున్న నేను, ఇంతవరకు నిన్ను నాకోసం ఏదీ అడగలేదు. ఈ రోజు, లేక లేక కలిగిన నా ఒక్కగానొక్క కూతురికి పట్టిన గతి చూడు! ఆమెను రక్షించే భారం నీది. నా బిడ్డకు ఈ గతి పట్టించిన ఆ నరరూప రాక్షసుడు నాశనమై పోవుగాక! నీ భక్తుణ్ణయిన నా బిడ్డకు కష్టం కలిగించిన ఆ పుష్పం మళ్ళీ పుష్పించకుండా పోవుగాక!" అని శపిస్తూ, చేతిలోని పుష్పహారాన్ని తెంచి ఆగ్రహావేశంతో చంద్రకేతుడి మీదికి విసిరి కొట్టాడు.

మరుక్షణమే పూజారి ఎదుట ఒక వింత వెలుగు వెలిగింది. ఆ వెలుగు మధ్య





తారు. సరే, ప్రస్తుతానికి అన్నీ మరిచిపో. ఆలయం లోపలికి రా! హారతికి సమయం దాటిపోతున్నది.నీకోసంకాచుకునిఉన్నాను," అన్నది, పూజారికి మాత్రం వినిపించే విధంగా.దేవీరూపంకూడా పూజారికిమాత్రమే కనిపించింది.

పూజారి సంతోషంగా లోపలికి వెళ్ళి, దేవీ విగ్రహానికి హారతి ఇచ్చి, ప్రశాంత హృదయంతో వెలుపలికి వచ్చాడు. కుమార్తె కళ్ళు తెరచి చిరునవ్వుతో, ఆయన పక్కన వచ్చి నిలబడింది. అక్కడ చేరిన వారు, భాగ్యశ్రీ మీద తైలం చల్లినవాడు యువరాజు చంద్రకేతుడనీ, అతడు తప్పించుకుని పారిపోతూ ఉండగా దూరం నుంచి రాక్షసుడిలాగా కనిపించాడనీ చెప్పారు.

విషయం తెలియగానే రాజు చంద్రకాంతుడు తమ్ముడి దుర్మార్గానికి సిగ్గుపడ్డాడు. పూజారి, రాజు దగ్గరికి వెళ్ళి, జరిగిన దానికి క్షమాపణలు చెప్పుకున్నాడు. రాజు పూజారిని ఓదార్చుతూ, "మీ కుమార్తె కోలుకున్న తరవాత ఆమెను రాజసౌధానికి పంపించు. కొంతకాలం నా కుమార్తెతో కలిసి గడిపిందంటే త్వరగా మామూలు మనిషి అవుతుంది!" అన్నాడు.

రాజగురువు ఇంతవరకు చెప్పి, "నేనీ విషయాలను చంద్రకాంత మహారాజు ఘనతను వివరించే తాళపత్రగ్రంథాలలో చదివాను. దేవీ శాపానికి గురైన పుష్పం

లైరంబీమాత ప్రత్యక్షమై, మందహాసం చేస్తూ, "బిడ్డా! నీ ప్రార్థన ఆలకించాను. నీ కుమార్తెకు ఎటువంటి హానీ కలగదు. ఆమె త్వరలో మామూలు మనిషి అవుతుంది. నీ కుమార్తెకు హాని తలపెట్టినవాణ్ణి నువ్వు నీ నోటితో నరరూపరాక్షసుడన్నావు. వాడు నిజంగానే రాక్షసుడుగా మారిపోతాడు. వాడికి ఈ భూమిమీద స్థానం ఉండదు. పువ్వులో ఏ దోషమూ లేనప్పటికీ అది ఆ దుర్మార్గుడి హీనకృత్యానికి ఉపయోగపడింది. కాబట్టి, నీ ఇష్టానుసారం ఆ పువ్వు ఇప్పుడిప్పుడే పూయదు. మునుముందు పూచినప్పటికీ, ప్రకృతికి విరుద్ధంగా ప్రవర్తించే వాళ్ళే దాని మూలంగా కష్టాల పాలవు





నూరేళ్ళ కొకసారి పూస్తుందనీ, అందుకే దానిని 'శతాబ్దిక' అని పిలుస్తారనీ విన్నాను. ఇప్పుడీ పువ్వులను చూస్తూంటే ఆ విష యాలు జ్ఞాపకం వచ్చాయి. ప్రజల శాంతి భద్రతలు కాపాడడం మీ బాధ్యత కాబట్టి ఆ విషయాలను మీకు తెలియజేసి హెచ్చ రించడం నా కర్తవ్యంగా భావించి వచ్చాను," అని చెప్పడం పూర్తిచేశాడు.

రాజు ప్రతాపవర్మ అంతావిని, దీర్ఘంగా ఆలోచించి, కుమార్తె వైపు తిరిగి, "ప్రియం వదా! ఆ పువ్వులను రాజభవనంలో ఉంచ కూడదని రాజగురువు సెలవిచ్చారు. కాబట్టి వాటిని ఉద్యానవనంలోకి తరలించడం అవసరం!" అన్నాడు.

ప్రియంవద, "అలాగే చేద్దాం, నాన్నా! ఇప్పుడే వాటిని తీయించే ఏర్పాట్లు చేస్తాను," అని రాజుతో అని, గురువు వైపు తిరిగి, "మధుర పరిమళాలు విరజిమ్మే ఆ పువ్వుల వెనక ఇలాంటి విషాద గాథ ఉండడం దుర దృష్టకరం!" అన్నది.

అంతలో ఒక భటుడు వచ్చి రాజుకు నమస్కరించి, "ప్రభూ! సేనాధిపతి తమ దర్శనం కోసం వెలుపల వేచి ఉన్నారు!" అన్నాడు.

"రమ్మను!" అన్నాడు రాజు.

భటుడు వెళ్ళిన కొంతసేపటికి సేనాధి పతి వచ్చి, రాజుకూ, రాజగురువుకూ నమస్కరించాడు.



"ఏమిటి! నిన్ను చూస్తూంటే పెద్ద సమ స్యతో వచ్చినట్టున్నావు!" అని అడిగాడు రాజు.

"నిజమే, ప్రభూ! పెద్ద సమస్యే ఎదుర యింది. ఈరోజు వేకువ జామునుంచి, మన రాజ్య దక్షిణ సరిహద్దులోని ప్రజలు ఇళ్ళు వదిలిపెట్టి చెట్టుకొకరు పుట్టకొకరుగా పరుగులు తీస్తున్నారు. కొందరు రాజధానీ నగరం వైపు వస్తున్నారు. తెల్లవారేసరికి సముద్రతీరంలోని ఇళ్ళన్నీ నేలమట్టమై ఉన్నాయి. ఇందుకు భూకంపం గాని, సముద్ర కెరటం వచ్చి ముంచిపోయిన దాఖలాలు గాని లేవు. పైగా అన్ని ఇళ్ళు కూలినప్పటికీ ఎలాంటి శబ్దమూ రాలేదట. అదృష్టవశాత్తు జననష్టం ఏమీ వాటిల్లలేదని





వార్తలు అందుతున్నాయి. ఎందుకిలా జరిగిందో ఊహించడం కష్టంగా ఉన్నది!" అన్నాడు సేనాధిపతి గంభీరవర్మ.

"సరే, ప్రజల రక్షణకు ఏమైనా ఏర్పాట్లు చేశావా?" అని అడిగాడు రాజు.

"అప్పుడే మన సైనికులు కొందరిని సముద్రతీరం కాపలాకు పంపాను. అనుమానాస్పదంగా ఎవరైనా కనిపిస్తే బంధించి తీసుకురమ్మని ఆజ్ఞాపించాను. మరొక సైనిక దళాన్ని, కష్టాలలో ఉన్న ప్రజలను ఆదుకోవడానికి పంపాను. ఇంకా కొందరు సైనికులను నగర ద్వారం దగ్గరికి పంపి, పారిపోయి వచ్చే వాళ్ళకోసం ఏర్పాటు చేసిన ప్రత్యేక శిబిరాలకు తీసుకువెళ్ళమని చెప్పాను. ఈ విషయాలను తమకు తెలియజేయడానికే వచ్చాను," అన్నాడు సేనాధిపతి.

"నివాసాలు పోగొట్టుకున్నవారిలో కొందరికి మన రాజప్రాసాదంలోనే ఆశ్రయం కల్పించవచ్చుగదా! ముఖ్యంగా స్త్రీలనూ, పిల్లలనూ ఇక్కడికి పంపండి!" అన్నది యువరాణి ప్రియంవద ఆతృతతో.

"మంచి ఆలోచన! మన రాజభవనంలో ఏ భాగాన్ని బాధితులకు కేటాయిస్తే బావుంటుందో నువ్వే ఆలోచించి చెప్పు. పైగా ఇక్కడికి వచ్చే స్త్రీలకూ, పిల్లలకూ అవసరమైన సదుపాయాలను సమకూర్చే పనులను నువ్వే స్వయంగా పర్యవేక్షించడం మరీ బావుంటుంది," అని రాజు కుమార్తెతో చెప్పి, సేనాధిపతివైపు తిరిగి, "బాధితులకు ఎటువంటి లోటూ రాకుండా చూసే బాధ్యత నీది. వారికి మునుముందు ఎటువంటి ఉపాధి కల్పించాలో తరవాత ఆలోచిద్దాం!" అని రాజగురువుకేసి తిరిగి, "తమరి సలహా ఏమిటి గురుదేవా!" అని అడిగాడు.

"అలాగే చెయ్యి, మహారాజా!" అని రాజగురువు కొంతసేపు మౌనంగా ఆలోచించి, "సేనాధిపతి తెచ్చిన వార్తను వింటూంటే, 'శతాబ్దిక' గురించి నేను అనుమానించిన విషయాలు నిజమవుతాయేమోనని భయంగా ఉన్నది, మహారాజా!" అన్నాడు విచారంగా. — (ఇంకావుంది)







# విచిత్ర పుష్పం

## 3

[రాజు ప్రతాపవర్మకూ, యువరాణి ప్రియంవదకూ రాజగురువు గౌరీనాధుడు విచిత్రపుష్పం 'శతాబ్దిక' శాపకారణం గురించిన విషయాన్ని తెలియజేశాడు. మాణిక్యపురి దక్షిణ ప్రాంతంలో సముద్రతీర గ్రామాలలోని కొన్ని ఇళ్ళు హఠాత్తుగా నేలమట్టమై పోయాయనీ, ప్రజలు భయభ్రాంతులై ఇల్లూ, వాకిలీ వదిలి పారి పోతున్నారనీ సేనాధిపతి గంభీరసింహుడు రాజుకు చెప్పాడు. — తరవాత]

సముద్ర తీరంలోని గ్రామాలు నేలమట్టమై పోవడానికి కారణం ఫలానా అని తెలియదు. అసలు ఏం జరిగిందో ఎవరికీ అంతుబట్ట లేదు. ఆ రాత్రంతా ఎప్పటిలాగే ప్రశాంతంగా గడిచింది. వర్షం కురియడం గాని సముద్ర కెరటాలు పొంగడం గాని జరగలేదు. తెల్లవారి లేచి చూసే సరికి చిన్నా పెద్ద ఇళ్ళన్నీ నేలమట్టమై కనిపించాయి. ఏం జరిగిందో అని తలకొక విధంగా ఊహించు కుంటూ, అక్కడ ఉంటే తమ ప్రాణాలకే ముప్పు వాటిల్ల గలదన్న భయంతో గ్రామ ప్రజలు చెట్టు కొకరు పుట్ట కొకరుగా పరు గులు తీశారు.

అలా పారిపోయి వచ్చిన వారు కొందరు రాజధానీనగరం చేరారు. నగర సింహ ద్వారం వద్ద ఉన్న కాపలా భటులు, ఈ విషయాన్ని సేనాధిపతికి తెలియజేశారు. సేనాధిపతి ఆజ్ఞానుసారం వాళ్ళను సైని



కులు ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన శిబిరాలకు తీసుకు వెళ్ళారు. శరణార్థులు కొందరు ఆలయ ప్రాంగణాల లోనూ, మరికొందరు వసంతోత్సవాలు జరిగిన మైదానంలోనూ ఆ రాత్రి గడిపారు.

యువరాణి ప్రియంవద, తన చెలికత్తెలతో కలిసి, రాజప్రాసాదంలో ఏభాగాన్ని శరణార్థులయిన స్త్రీలకూ, పిల్లలకూ కేటాయిస్తే బావుంటుందో పరిశీలించి, ఆ భాగాన్ని ఖాళీ చేయించి సిద్ధం చేయించే సరికి అర్ధరాత్రి దాటింది.

తెల్లవారగానే రాజు ప్రతాపవర్మ, సేనాధిపతి గంభీరసింహుడితో కలిసి, శరణార్థులుగా వచ్చిన ప్రజలను పరామర్శించ డానికి వెళ్ళాడు. రాజును చూడగానే ప్రజలు, "ఇల్లూ, వాకిలీ, గొడ్డూ గోదా అంతా వదిలి కట్టుబట్టలతో పారిపోయి వచ్చాము, మహారాజా! తిరిగి వెళ్ళాలన్నా భయంగా ఉన్నది. తిరిగి వెళ్ళినా, మా ఇళ్ళన్నీ నాశనం కాకుండా ఉంటాయన్న నమ్మకం లేదు. ఏ నిమిషాన ఎటువంటి ఆపద ముంచుకు వస్తుందో తెలియదు", అన్నారు దీనంగా.

"మీకు రక్షణ కల్పించే బాధ్యత నాది. మీ ప్రాణాలకు గానీ, ఆస్తిపాస్తులకు గానీ ఎటువంటి హానీ రాదు. మీరు నిశ్చింతగా ఉండండి!" అని రాజు వాళ్ళను ఆప్యాయంగా ఓదార్చి, సేనాధిపతి గంభీర సింహుడి కేసి చూశాడు.

"నిన్ననే మన సైనికులు కొందరిని దక్షిణ ప్రాంతానికి పంపాను. ఎటువంటి ఆపద వచ్చినా ఎదుర్కోవడానికి వాళ్ళు సిద్ధంగా వెళ్ళారు. గ్రామస్థులు వదిలి వచ్చిన ఇళ్ళనూ, ఆస్తిపాస్తులనూ చెక్కు చెదర కుండా రక్షించే బాధ్యత కూడా మన సైనికులకు అప్పగించాను. వంతుల వారీగా, అంటే – ఉదయం నుంచి సాయంకాలం వరకు కొందరినీ, సాయంకాలం నుంచి తెల్లవారేదాకా మరికొందరినీ కాపలా ఉంచడానికి ఏర్పాట్లు చేశాను, ప్రభూ! అందుకుకావలసినంత మంది సైనికులను పంపాను. కాబట్టి వీళ్ళు తమ ఇళ్ళ భద్రత





గురించి బెంగపడవలసిన అవసరం ఏమీ లేదు," అన్నాడు సేనాధిపతి.

"అలాగా!" అన్నాడు రాజు సంతోషంగా.

"మరొక శుభవార్త, ప్రభూ! శరణార్థులుగా వచ్చినస్త్రీలకోసం,పిల్లలకోసం,యువరాణి రాజప్రాసాదం లోని పడమటి దిశ భాగాలను కేటాయించారు.స్వయంగాఅక్కడి ఏర్పాట్లన్నీ చూసి, యువరాణి నిద్ర పోవటానికి అర్ధరాత్రి దాటిందని పరిచారికలు నాకు తెలియజేశారు," అన్నాడు సేనాధిపతి.

"పేదలకు సాయ పడాలనే పరోపకార బుద్ధి ప్రియంవదకు బాల్యం నుంచే ఉన్నది. సరే అక్కడి ఏర్పాట్లు ఎలా ఉన్నవో వెళ్ళి చూద్దాం," అన్నాడు రాజు ఎంతో ఉత్సాహంగా.

"చిత్తం, ప్రభూ!" అని సేనాధిపతి రాజు వెంట నడిచాడు.

రాజూ, సేనాధిపతీ రాజప్రాసాదం పడమటి భాగాన్ని చేరే సరికి, అక్కడ స్త్రీలూ, పిల్లలూ వరుసలు వరుసలుగా కూర్చుని ఉన్నారు. వాళ్ళ ముందు ఆకులు పరచి ఉన్నాయి. కొంతసేపటికి, యువరాణి ప్రియంవద వెంట వచ్చిన పరిచారికలు పాత్రలలో తెచ్చిన భోజనం అందరికీ వడ్డించారు. అందరూ చాలా సంతోషంగా భోజనం చేస్తున్న దృశ్యం చూసిన రాజు పరమానందం చెంది, "ప్రియంవదా, నీ ఔదార్యం మెచ్చుకో తగినది. బాధలలో ఉన్నవాళ్ళను ఆదుకోవడం లోనే మానవ జన్మకు సార్థక్యం లభిస్తుంది. ఆవిషయం










గ్రహించిన నిన్ను చూస్తుంటే నాకెంతో ఆనందంగా ఉన్నది. నిన్ను కన్నందుకు నేనెంతో గర్వపడుతున్నాను. ఈ పేద ప్రజలు నీమేలును చిరకాలం గుర్తుంచుకుంటారు. వీళ్ళు ఇక్కడ ఉన్నంత వరకు ఇప్పటి లాగే వాళ్ళ అవసరాలన్నీ చూసే ముఖ్యమైన బాధ్యత నీకు అప్పగిస్తున్నాను," అన్నాడు.

యువరాణి సరే అన్నట్టు చిరునవ్వుతో తల ఊపుతూ, "మీకు ఇక్కడి విచారమేమీ వద్దు, నాన్నా ! ఇక్కడి వాళ్ళకు ఎటువంటి కొరతా లేకుండా చూసుకునే బాధ్యత నాది. మిగతా చోట్ల ఉన్న శరణార్థులను గురించి మీరు ఆలోచించండి," అన్నది వినయంగా.

రాజూ, సేనాధిపతీ అక్కడి నుంచి బయలుదేరి రాజప్రాసాదం ప్రధాన భవనం సమీపిస్తూండగా, నలుగురు సైనికులు ఎదురు పడ్డారు. వాళ్ళెందుకో ఆందోళన చెందుతున్నట్టు కనిపించారు.

"ఏమిటి అలా ఉన్నారు? ఏం జరిగింది?" అని అడిగాడు సేనాధిపతి.

"నిన్న దక్షిణ ప్రాంతాలకు వెళ్ళిన మన సైనికుల జాడ కనిపించడం లేదు, ప్రభూ !" అన్నారు సైనికులు.

"ఏమయ్యారు?" అని అడిగాడు సేనాధిపతి కోపంగా.

"ఆ సంగతి చెప్పడానికి కూడా అక్కడెవరూ లేరు. ఈ రోజు ఉదయం మన సైనికులు అక్కడికి చేరేసరికి, ఆ ప్రాంతమంతా నిర్మానుష్యంగా ఉన్నది. మరికొన్ని గ్రామాలు నేలమట్టమై ఉన్నాయి," అన్నారు సైనికులు.

"ఉదయం వెళ్ళిన సైనికులు తిరిగి వచ్చారా? అక్కడే ఉన్నారా?" అని అడిగాడు సేనాధిపతి.

"ముగ్గురు సైనికులు వచ్చి, ఆ విషయం తెలియజేసి, వెంటనే తిరిగి వెళ్ళిపోయారు. వాళ్ళ వెంట మన దళనాయకుడు వీరసింహుడు కూడా వెళ్ళారు," అన్నారు సైనికులు.

"అలాగా, వీరసింహుడు రాగానే నన్ను చూడమని చెప్పండి," అన్నాడు సేనాధిపతి.

"చిత్తం, ప్రభూ !" అని సైనికులు వెళ్ళి పోయారు.

"మరిన్ని ఇళ్ళు నేలమట్టమయ్యాయని తెలిస్తే, ఇక్కడున్న వాళ్ళు మరింత హడలి పోగలరు. ఆవిషయాన్ని మనమధ్యే ఉంచు దాం. సముద్ర తీరానికి వెళ్ళిన దళ నాయకుడు తిరిగి రాగానే, బహుశా మన సైన్యాన్నిఅక్కడికి నడిపించవలసి రావచ్చు. కాబట్టి సైన్యాన్ని సిద్ధంగా ఉంచడం అవ సరం?" అన్నాడు రాజు.

"అలాగే చేద్దాం ప్రభూ. దళ నాయ కుడు రాగానే మీ దగ్గరికి వస్తాను," అని చెప్పి సేనాధిపతి బయలుదేరాడు.

సైనికులతో పాటు సముద్ర తీరానికి వెళ్ళిన దళనాయకుడు, ఆ రోజు సాయం కాలానికి హడావుడిగా తిరిగి వచ్చి, సేనాధి పతికి నమస్కరించాడు.

"ఏమిటలా బిక్కమొహంతో ఉన్నావు? అసలు అక్కడ ఏంజరిగిందో తెలుసుకుని వచ్చావా?" అని అడిగాడు సేనాధిపతి.

"అంతా వింతగా ఉన్నది, ప్రభూ ! నిన్న వెళ్ళిన మన సైనికులు సముద్రతీరం చేరుకున్నారనడంలో సందేహం లేదు. ఎందుకంటే వారి అడుగుజాడలు స్పష్టంగా కనిపించాయి. వాళ్ళు అక్కడ చేరుకున్న తరవాత ఏంజరిగిందో తెలియ లేదు. చెప్ప డానికి అక్కడ ఒక పిట్ట కూడా లేదు," అన్నాడు దళనాయకుడు.

"ఇప్పుడేం చేద్దామని నీ ఉద్దేశం?" అని అడిగాడు సేనాధిపతి.







"శభాష్ ! అలాగే చెయ్యి", అని చెప్పి సేనాధిపతి రాజభవనానికి వెళ్ళి, రాజుకు విషయం తెలియజేసి, అక్కడి నుంచి శరణార్థుల శిబిరాలకు వెళ్ళాడు. అక్కడ వచ్చిన వాళ్ళకందరికీ కూడా ఆహారపానీయాలకు గానీ, విశ్రాంతి తీసుకోవడానికి గానీ ఎటువంటి ఇబ్బందులూ కలగ లేదు. రాజభటులే కాకుండా నగర ప్రజలు కూడా వాళ్ళకు సాయపడడం చూసి సేనాధిపతి ఎంతో సంతోషించాడు.

మరునాడు తెల్లవారుతూ ఉండగా, దళనాయకుడు వీరసింహుడు సేనాధిపతి ఇంటికి వచ్చాడు. అతన్ని చూడగానే సేనాధిపతి, "అప్పుడే వెళ్ళి వచ్చావా? ఎలా ఉన్నది పరిస్థితి?" అని అడిగాడు.

"సముద్రతీరంలోని సైనికులందరూ ఒకేచోట ఉండకుండా వాళ్ళను మూడు జట్లుగా విడ దీశాను. మొదటి జట్టు సముద్ర తీరంలో ఉంటుంది. రెండవ జట్టు వాళ్ళకు కూతవేటు దూరంలో ఉంటుంది. మూడవ జట్టు ఇంకా ఇవతల ఉంటుంది. మూడు జట్లకూ మధ్య సమాచారం అందుతూనే ఉండే విధంగా అప్రమత్తంగా ఉండమని ఆజ్ఞాపించి వచ్చాను. తమరు అనుమతించినట్టయితే తెల్లవారగానే నేను ఒకసారి స్వయంగా అక్కడికి వెళ్ళి, సమాచారం తెలుసుకుని వచ్చి మీకు తెలియజేస్తాను," అన్నాడు దళనాయకుడు.

"చాలా భయానకంగా ఉన్నది, ప్రభూ! నేను బయలుదేరుతూ ఉండగా అక్కడి సైనికులు కొందరు వచ్చి చెప్పారు. ఆ రాకాసిమృగం మళ్ళీ వచ్చిందట!" అన్నాడు దళనాయకుడు.

"రాకాసిమృగమా!" అన్నాడు సేనాధిపతి అమితాశ్చర్యంతో.

"అవును ప్రభూ! సరిగ్గా అర్ధరాత్రి సమయంలో సముద్రంనుంచి పర్వతాకారంలో ఒక రాకాసిమృగం పైకిరావడం సైనికులకు కనిపించిందట. అది నేల మీద నడుస్తున్నదో లేక గాలిలో అలా తేలుతున్నదో తెలియలేదట! అయితే, అది





తన తలను అటూ ఇటూ ఆడిస్తూ మెల్లగా కదులుతున్న కొద్దీ దాని కాళ్ళకింద ఇళ్ళూ, ఇళ్ళల్లోని మనుషులూ, చెట్లూ సర్వం అలాగే భూమిలోకి దిగిపోయాయట. అయితే, అది ఏమాత్రం శబ్దం చేయకుండా భీకరమైన తలను అటూ ఇటూ ఆడిస్తూ ఉత్తర దిశగా కదిలి పోయిందట. సముద్ర తీరంలో ఉన్న మన సైనికులు దాని పాదాల కిందపడి అలా నేలలోకి కూరుకు పోయారట. వాళ్ళకు కొంత దూరంలో నిలబడిన మిగతా సైనికులు ఆ ప్రాణిని వెనకనుంచే చూశారు గాని, దాని ముఖం చూడ లేదు. అక్కడి నుంచి భయభ్రాంతులై పారిపోయి వచ్చారు," అన్నాడు దళనాయకుడు.

"అది ఎలాంటి రాకాసిమృగమై ఉంటుంది? అది ఉత్తర దిశగా ఎందుకు వెళ్ళింది?" అన్నాడు సేనాధిపతి మనసులో అనుకుంటున్నట్టు.

"అవును ప్రభూ ! మన సైనికులు దానిని ఎదుర్కొని వుంటే వాళ్ళు కూడా దాని పాదాల కింద పడి భూమిలోకి కూరుకు పోయి ఉండేవాళ్ళు ! వాళ్ళు భయపడి తిరిగి రావడం వల్లే దాని విషయం మనకు తెలిసింది," అన్నాడు దళనాయకుడు నెమ్మదిగా!

సేనాధిపతి కొంతసేపు మౌనంగా ఆలోచించి, "సరే, అది ఉత్తర దిశగా వెళ్ళిందంటున్నావు. అదిసముద్రంనుంచిరావడం వల్ల తెల్లవారేలోగా మళ్ళీ సముద్రం చేరి ఉంటుందనే భావిస్తున్నాను. ఉత్తర దిశకు మన సైనికులు కొందరిని పంపు. అక్కడ ఏదైనా ప్రమాదం వాటిల్లి ఉండవచ్చు. దక్షిణ సముద్ర తీరంలో కాపలాను యధా ప్రకారం కొనసాగించు. నిన్న రాత్రి లాగే సైనికులను మూడు జట్లుగా విడదీసి కాపలాఉంచు. ఆ రాకాసిమృగం గురించి మరేదైనా విషయాలు తెలిస్తే వెంటనే వచ్చి చెప్పు. నేనీవిషయం రాజుకు చెప్పివస్తాను. ఈ అపాయం నుంచి ప్రజలను కాపాడవలసిన బాధ్యత మనకున్నది," అన్నాడు సేనాధిపతి.

—(ఇంకావుంది)








## 4

[మాణిక్యపురి దక్షిణప్రాంత సముద్రతీర గ్రామాలు కొన్ని హఠాత్తుగా నేలమట్టం కావడంతో, భయభ్రాంతులై పారిపోయి వచ్చిన కొందరు ప్రజలు రాజధానీనగరం చేరారు. రాజూ, యువరాణీ, సేనాధిపతీ వారికి ఆశ్రయం కల్పించే ఏర్పాట్లలో నిమగ్నులయ్యారు. సముద్రం నుంచి వచ్చిన ఒక రాకాసిమృగమే ఆ బీభత్సాన్ని సృష్టించిందని దళనాయకుడు, సేనాధిపతికి చెప్పాడు. —తరవాత]

సేనాధిపతి గంభీరసింహుడు హుటాహుటిగా రాజభవనానికి వెళ్ళి, దళనాయకుడు వీరసింహుడు చెప్పిన విషయాన్ని రాజుకు తెలియజేశాడు. ఆ సంగతి విన్న రాజు ప్రతాపవర్మ, "ఏమిటీ! రాకాసి మృగమా? చరిత్రకు అందని కాలంలో ఎప్పుడో ఉండేవని చెప్పుకునే రాకాసి మృగాలు ఈ కాలంలో ఉండడం అసంభవం. గ్రామాలకు గ్రామాలు నేల మట్టమైపోయి, ప్రజలు ప్రాణభీతితో పారిపోతున్న మాట నిజమేకావచ్చు. అయితే ఆ బీభాత్సానికి కారణం ఏదో రాకాసిమృగం అంటే నమ్మశక్యం కాకుండా ఉన్నది. ఇంతకూ, ఆ మృగాన్ని కళ్ళారా చూసిన వాళ్ళు ఇక్కడికి ఎవరూ రాలేదు. సైనికులు చెప్పిన విషయాన్ని దళనాయకుడు నీకు చెప్పాడు. కాబట్టి వాళ్ళ మాటలు ఎంత వరకు నిజమో ఆలోచించాలి," అన్నాడు.



"మంచిది. అలాగే వెళ్ళిరా. నువ్వు వచ్చేలోగా నేను రాజగురువును పిలిపించి, ఏంచేయాలో ఆలోచిస్తాను. మునుముందు ఈ విషయంలో మనం రాజగురువు సలహాను పాటించడం శ్రేయస్కరం," అన్నాడు రాజు.

"చిత్తం, మహారాజా!" అని అక్కడి నుంచి బయలుదేరిన సేనాధిపతి, శరణార్థులుగా వచ్చిన స్త్రీలూ, పిల్లలూ, తలదాచుకున్న రాజప్రాసాదం పడమటి భాగానికి వెళ్ళాడు. సేనాధిపతిని చూడగానే, అక్కడి కాపలాభటులు, అతనికి గౌరవంగా నమస్కరించి, "అంతా సక్రమంగా జరిగి పోతున్నది ప్రభూ! ఇక్కడ సమస్యలేవీ లేవు. ఇక్కడి శరణార్థులను చూడడానికి మన యువరాణిగారు కూడా ఇప్పుడే వచ్చారు," అని చెప్పారు.

గంభీరసింహుడు గుర్రందిగి, రెండు వైపులా పెద్ద పెద్ద రాతి స్తంభాలున్న విశాలమైన మంటపంలోకి అడుగు పెట్టాడు. అప్పుడు పక్క గదిలోనుంచి మామూలు దుస్తులలో వున్న యువరాణి ప్రియంవద ఇద్దరు చెలికత్తెలతో వెలుపలికి వచ్చింది. సేనాధిపతిని చూడగానే ఆమె, "ఇక్కడున్న వారికి ఆహార పానీయాలకు ఎటువంటి కొరతా లేదు. పసిపిల్లలకు ఎటువంటి అనారోగ్యమూ కలగకుండా తగిన ముందు జాగ్రత్తలు తీసుకోమని ఆస్థాన వైద్యులకు

"నిజమే, ప్రభూ! దళనాయకుడు వీరసింహుడు నేలమట్టమైన గ్రామాలను చూశాడే తప్ప, రాకాసిమృగాన్ని చూడలేదు. అయితే, గ్రామాలకు గ్రామాలు అలా నాశనమై పోవడానికి మరే ప్రకృతి వైపరీత్యం జరగలేదని తెలుస్తూనే ఉన్నది. కాబట్టి, ఆ రాకాసిమృగాన్నిచూశామని చెప్పే మన సైనికుల మాటలను ఆధారరహితం అని తోసివేయడానికి లేదని నాకని పిస్తున్నది. తమరు అనుమతించారంటే ఈ రాత్రికి నేనే, ఆ స్థలానికి స్వయంగా బయలుదేరి వెళ్ళి, అసలు అక్కడ ఏం జరిగిందో తెలునుకుని వస్తాను," అన్నాడు సేనాధిపతి గంభీరసింహుడు వినయంగా.





చెప్పాను. పసిపిల్లల ఆరోగ్యాన్ని అలక్ష్యం చేయకూడదు కదా," అన్నది.

"చాలా సంతోషం, యువరాణీ! పసి పిల్లల క్షేమంపట్ల తమరు చూపుతూన్న శ్రద్ధ ప్రశంసనీయమైనది. ప్రతివిషయం లోనూ ముందుజాగ్రత్తతో వ్యవహరించడం అన్ని విధాలా మంచిది," అన్నాడు సేనాధిపతి.

"ఇక్కడి స్త్రీలు, సుఖంగానే ఉన్నారు గాని, తమ భర్తల మీద బెంగతో ఉన్నారు. కాబట్టి దూరంగా వున్న పురుషులు ఒకసారి వచ్చి, వాళ్ళ భార్యాబిడ్డలను చూసే ఏర్పాటు చేసినట్టయితే బావుంటుంది," అన్నదియువ రాణి.

"అలాగే, యువరాణీ! రేపు సాయం కాలానికి కొందరిని పంపే ఏర్పాటు చేస్తాను," అని చెప్పి సేనాధిపతి అక్కడి నుంచి శరణార్థులున్న వేరొక శిబిరానికి బయలుదేరాడు.

అంతలో దళనాయకుడు వీరసిం హుడు ఎదురుపడి నమస్కరించి, "ఈ రోజు మరికొందరు సైనికులు గాయాలతో తిరిగి వచ్చారు. వారికి మన వైద్యులు చికిత్స చేస్తున్నారు. అయినా, వాళ్ళకు ప్రాణ భయం పట్టుకున్నది. హడలిపోయి, ఎప్పుడూ రాకాసి మృగం గురించే పలవరిస్తున్నారు," అన్నాడు..

"వాళ్ళ మాటలే గనక నిజమైనట్టయితే, మనరాజ్యం ఇప్పుడు భయంకరమైన ఆపద పాలవడం ఖాయం. కాబట్టి దానిని ఎదుర్కోవడానికి ఇతరుల సాయం కూడా





కాపలాకు వెళ్ళ వలసిన సైనికదళాన్ని యథాప్రకారం వెళ్ళనివ్వు. మనం విడిగా వెళదాం. మన ప్రయాణ విషయం మరెవ్వరికీ తెలియ కూడదు," అన్నాడు సేనాధిపతి.

ఆ రోజు మధ్యాన్నం, సేనాధిపతీ, దళనాయకుడూ మరి ముగ్గురు సైనికులూ గుర్రాల మీద మాణిక్యపురి దక్షిణ సరిహద్దులకు బయలు దేరారు. సాయంకాలానికి సముద్రతీరం చేరుకున్నారు.

అక్కడి గ్రామాలన్నీ నేలమట్ట మైపోయి, చెట్టు చేమలు కూడా నాశనమై పోయి కనిపించాయి. నిర్మానుష్యంగా ఉన్న గ్రామాలకు కాపలా కాస్తున్న భటులు వాళ్ళకు ఎదురుపడి నమస్కరించారు. సేనాధిపతీ, దళనాయకుడూ వాళ్ళను దాటుకుని వెళ్ళి సముద్రతీరం లోని ఇసుక మీద అడుగుజాడ లేవైనా కని పిస్తాయేమో నని జాగ్రత్తగా పరిశీలించ సాగారు. ఒకచోట దేనినో నేలమీద లాక్కుని వెళ్ళినట్టు సమాంతరంగా రెండు విశాల మైన చారలు కనిపించాయి. ఆ చారలు సముద్ర జలం దగ్గరి నుంచి అరంభమై ఉత్తర దిశగా చాలా దూరం వరకు కనిపించాయి. ఆ చారల మధ్య అక్క డక్కడ కొన్ని ఖాళీలు కనిపించాయి. సముద్రం నీటికి సమీపంలో, తడిగా ఉన్న ఇసుక మీద ఆచారలకు బదులు రెండు

కోరవలసి రావచ్చు. దేనికైనా ఆ రాకాసిమృగం గురించిన విషయాలు ప్రత్యక్షంగా తెలుసుకోవడం అవసరం. అందువల్ల నేనే స్వయంగా మనరాజ్యం దక్షిణప్రాంతానికి వెళుతున్నాను. నువ్వా నాతోపాటు రావాలి. సాయంకాలాని కల్లా సిద్ధం కావాలి," అని ఆజ్ఞాపించాడు సేనాధి పతి.

"చిత్తం! సైనికదళాన్ని కూడా మన వెంట తీసుకుని వెళదామా, ప్రభూ?" అని అడిగాడు దళనాయకుడు చాలా ఉత్సా హంగా.

"వద్దు. నీతో పాటు మరో ముగ్గురు సైనికులు వస్తే చాలు. అయితే, ఈ రాత్రి





పెద్ద పాదాల గుర్తులు కనిపించడంతో దళనాయకుడు వాటిని సేనాధిపతికి చూపుతూ, "సముద్రంలో నుంచి ఏదో పెద్దప్రాణి బయటికి వచ్చిందనడంలో ఇసుమంత సందేహం కూడా లేదు ప్రభూ!" అన్నాడు.

"అవును! సముద్రం నుంచి వచ్చిన ఆ వింత ప్రాణి మళ్ళీ సముద్రం లోపలికే చేరి ఉండాలి. ఈ చారలు ఉత్తరదిశగా మాత్రమే వెళ్ళడం గమనించావా?" అని అడిగాడు సేనాధిపతి.

"నిజమే ప్రభూ!" అంటూ దళ నాయకుడు మరేవైనా గుర్తులు కనిపిస్తాయేమోనని సముద్రతీరమంతా జాగ్రత్తగా పరిశీలించి చూడసాగాడు.

కొంతసేపటికి చీకటి పడింది. ఆ తరవాత ఏదీ స్పష్టంగా కనిపించలేదు. ఆ రాత్రి వాళ్ళు, కాపలా ఉన్న భటులకు కొద్ది దూరంలో గడపాలని నిశ్చయించారు. ఆ సంగతి కాపలా ఉన్న భటులకు కూడా తెలియదు.

అర్ధరాత్రి దాటింది. ఒక వైపున సముద్రం, మరొక వైపున విశాలమైన ఇసుక మైదానం. ఆకాశంలో అక్కడక్కడ మెరుస్తూన్న చుక్కలు తప్ప మరేదీ కనిపించడంలేదు.

నాలగవ జాము ఆరంభం కాగానే సేనాధిపతికి ఉత్తర దిశలో చీకటికొండలా



ఏదో ఒక ఆకారం కదలడం కనిపించింది. అది క్రమంగా తమకేసి రావడం అతడు గమనించి, దళనాయకుడికి చూపాడు. అది మెల్లగా కదులుతూ ముందుకు వస్తున్నది. అటూ ఇటూ కదులుతున్న దాని తల, ఎత్తయిన చెట్లకు పైన కనిపించింది. అది ఇంకా ముందుకు రావడంతో దాని భీకరమైన రూపం మరింత స్పష్టంగా కనిపించింది. అయితే, అది ఏమాత్రం శబ్దం చేయడం లేదు. తాడిచెట్ల వంటి కాళ్ళూ, కొండచిలువల వంటి చేతులూ గల అతిభీకరమైన ఆ రాకాసిమృగం రూపం సేనాధిపతికి సైతం మనస్సులో భయం పుట్టించింది!



సముద్రం నుంచి వెలుపలికి వచ్చి, ఉత్తరదిశగా వెళ్ళి, సూర్యోదయం కల్లా వెనుదిరిగి సముద్రం చేరుతుందన్న విషయం రూఢి అయింది. దాని నెవరూ ఎదుర్కోలేరు కాబట్టి, తమవెంట వచ్చిన ముగ్గురు సైనికులను, రాజధానికి తిరిగి వెళ్ళమని సేనాధిపతి అజ్ఞాపించాడు. కాపలా కాయడానికి అక్కడికి అంతకు ముందు వచ్చిన సైనికుల జాడ కనిపించ లేదు. వాళ్ళు రాత్రి వచ్చిన ఆ రాకాసి మృగం పాదాల కిందపడి ప్రాణాలు కోల్పోయి ఉంటారని సేనాధిపతి గ్రహించాడు.

సేనాధిపతీ, దళనాయకుడూ ఆ రాకాసి మృగం మార్గానికి అడ్డు పడకుండా ఎంతో జాగ్రత్తగా పక్కకు తప్పుకున్నారు. అదృష్ట వశాత్తు వారి వెంట వచ్చిన సైనికులు కూడా దాని పాదాల కింద పడకుండా తప్పించుకున్నారు.

తూరుపు దిక్కున అరుణ రేఖలు ఉద యిస్తూండగా ఆ రాకాసిమృగం సముద్రం లోకి దిగి అలాగే లోపలికి వెళ్ళి పోయింది!

సేనాధిపతికి, నడుస్తున్న పర్వతం లాగా ఉన్న ఆ రాకాసిమృగాన్ని చూస్తూంటే, మానవమాత్రు లెవరూ దానిని ఎదుర్కో లేరనిపించింది. భయంకరమైన ఆ వింత ప్రాణి ఏ అర్ధరాత్రి సమయంలోనో

"ఆ రాకాసిమృగాన్ని ఎదుర్కొని, మన ప్రాణాలనూ, సైనికుల ప్రాణాలనూ పోగొట్టు కోవడం వివేకం కాదు ప్రభూ! అంతకన్నా, ఆ రాకాసిమృగం మన రాజ్యంలోకి జొరబడి నాశనం చేయకుండా జాగ్రత్త పడడం క్షేమం, అనుకుంటాను," అన్నాడు దళ నాయకుడు.

"నిజమే. అది మనరాజ్యంలో అడుగు పెట్టకుండా చేసే పథకం ఏదో ఆలో చించాలి. వీలయితే, దానిని హతమార్చే ఉపాయం కూడా ఆలోచించాలి. మనం ఇప్పుడే రాజధానికి వెళ్ళి రాజుగారితో విషయం చెప్పాలి. ఈ రాత్రికి మన భటుల నెవ్వరినీ కాపలాకు పంపవద్దు. రేపు తెల్లవారాక నువ్వు ఒకసారి ఇక్కడికి వచ్చి ఆ రాకాసిమృగం అడుగు జాడలు మరె





క్కడయినా కనిపిస్తాయేమో చూసి రా," అంటూ సేనాధిపతి గుర్రం మీదికి ఎక్కాడు.

మరొక గుర్రం మీద దళనాయకుడు బయలు దేరాడు. ఇద్దరూ శరవేగంతో రాజధానీ నగరం చేరుకున్నారు.

సేనాధిపతి రాజప్రాసాదం చేరే సరికి, అక్కడ రాజు ప్రతాపవర్మ, రాజగురువు గౌరీనాథుడితో ఏదో తీవ్రంగాచర్చిస్తున్నాడు. ఆయన సేనాధిపతిని చూడగానే, "ఆ వింత ప్రాణిని చూశావా?" అని అడిగాడు చాలా ఆదుర్దాగా.

"చూశాను ప్రభూ! సైనికుల మాటలలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. అది తప్పక రాకాసిమృగమే!" అంటూ సేనాధిపతి తాను దక్షిణ సముద్ర తీరంలో చూసిన దృశ్యాన్ని వివరించి, "ఆ రాకాసిమృగం అర్ధరాత్రి సమయంలో సముద్రం నుంచి వెలుపలికి వచ్చి, తిన్నగా ఉత్తరదిశకు వెళ్ళి, తెల్ల వారేలోగా మళ్ళీ సముద్రం చేరుతున్నది. అతి భీకరమైన ఆ రాకాసి మృగాన్ని చంప గల శక్తివంతులు మనలో ఎవరూ లేరు!" అన్నాడు.

ఆ మాటలు విని రాజు మౌనంగా ఆలోచించ సాగాడు.

అప్పుడు రాజగురువు, "మహారాజా! పూజారి కులశ్రేష్ఠుడి శాపానికి గురైన చంద్రకేతు, ఈ రాకాసిమృగం రూపంలో



తిరుగుతున్నా డేమో అన్న అనుమానం నాకు కలుగు తున్నది. ఎందుకంటే చాలా అరుదుగా పూచే 'శతాబ్దిక' ఇప్పుడు మన రాజ్యానికి ఉత్తరదిశలో పూచి ఉన్నది. ఆ విచిత్రపుష్పం కోసమే రాకాసిమృగం రూపం లోవున్న చంద్రకేతు అక్కడికి ఆకర్షింప బడుతున్నాడని నాకనిపిస్తున్నది. కాబట్టి ప్రస్తుతం ఆ 'శతాబ్దిక' పుష్పాలే మనల్ని కాపాడాలి!" అన్నాడు.

"మనకు అరిష్ట దాయకాలని తమరు సెలవిచ్చిన ఆ విచిత్ర పుష్పాలే, ఇప్పుడు మనల్ని ఈ ఆపదనుంచి కాపాడగలవా? అదెలా సంభవం గురుదేవా?" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

"పూజారి శాపానికి గుర్రై ఈ భూమి మీద చోటులేకుండా పోయిన చంద్రకేతును ప్రస్తుతం ఆ విచిత్ర పుష్పాలే మాణిక్యపురికి ఆకర్షిస్తున్నాయి. ఆ విచిత్ర పుష్పాలను, మనం ఆ రాకాసిమృగం అంటే, చంద్రకేతు ఉంటున్న సముద్ర మధ్యానికే చేర్చామంటే, ఆ నరరూప రాక్షసుడు ఇటువైపు వచ్చే అపాయం తప్పుతుంది కదా? అయితే ఆ సాహస కృత్యం చేయగల సమర్థులయిన వీరు లెవరో చూడాలి!" అన్నాడు రాజగురువు.

ఆ మాటలతో రాజుకు శృంగ్మాయ్ కొండలలో నివసించే ఉత్తుంగజాతి ప్రజలు గుర్తుకు వచ్చారు. వసంతోత్స వాలకు వచ్చి, వివిధ పోటీలలో గెలు పొందిన ఉత్తుంగుడనే యువకుడూ, అతడి మిత్రులూ తనను అక్కడికి ఆహ్వానించిన విషయం రాజు మనసులో మెదిలింది. ఆ విచిత్ర పుష్పాలను యువరాణికి కానుకగా ఇచ్చింది ఉత్తుంగుడే కాబట్టి, అతన్ని ఈ విషయంలో ఉపయోగించు కోవడం ఒక్కటే రాజుకు తరుణోపాయంగా తోచింది. కొంతసేపు దీర్ఘంగా ఆలోచించి ఆయన తల పంకించి, సేనాధిపతి కేసి తిరిగి, "నేను మన రాజ్య రక్షణ కోసం రేపే శృంగ్మాయ్ కొండలకు బయలుదేరు తున్నాను. నా వెంట దళనాయకుడు వీరసింహుడు. ఒక్కడు వస్తే చాలు. అతడు ఇంతకు పూర్వమే ఒకసారి ఆ ప్రాంతానికి వెళ్ళి వచ్చాడు. మేము తిరిగి వచ్చేవరకు ఇక్కడి శరణార్థులకు ఎటువంటి కొరతా లేకుండా చూసుకోవడం నీ బాధ్యత!" అని, రాజగురువు కేసి తిరిగి, "నా ప్రయాణం, విజయవంతం కావాలని ఆశీర్వదించండి, గురుదేవా!" అని నమస్కరించాడు.

"ప్రజలను రక్షించడానికి చక్కని నిర్ణయం తీసుకున్నావు, నాయనా! రాజ్య రక్షణ కోసం ప్రాణత్యాగం చేయడానికి సిద్ధపడే సాహసవీరులు ఉత్తుంగజాతి ప్రజలు! నీకు తప్పక విజయం సిద్ధిస్తుంది. లైరంబీమాత నీకు తోడుగా ఉండి నిన్నూ, నీ ప్రజలనూ రక్షించుగాక!" అని ఆశీర్వ దించాడు రాజగురువు.— (ఇంకావుంది)



# విచిత్ర పుష్పం

## 5

[సేనాధిపతి గంభీరసింహుడు దక్షిణ సముద్రతీరానికి వెళ్ళి అక్కడ రాకాసిమృగాన్ని చూసి, తిరిగివచ్చి, ఆ విషయాన్ని రాజుకు తెలియజేశాడు. ఉత్తర ప్రాంతంలో పూచిన 'శతాబ్దిక' పుష్పాలే సముద్రంలోని రాకాసిమృగాన్ని భూమి మీదికి ఆకర్షిస్తున్నాయని రాజగురువు రాజుకు చెప్పాడు. ఈ విషయంగా శృంగ్మాయ్ కొండలలోని ఉత్తుంగజాతి యువకుల సాయం కోరడానికి అక్కడికి వెంటనే వెళ్ళాలని రాజు నిశ్చయించాడు. —తరవాత]

రాజు ప్రతాపవర్మ వస్తున్నాడని రాజభటులు తెలియజేయగానే ఉత్తుంగ తెగనాయకుడు శుంభుడు సంతోషంతో ఉప్పొంగిపోయాడు. వెంటనే గూడెమంతా డప్పులు వాయించి, దండోరా వేశారు. క్షణాల్లో ప్రజలందరూ గూడెంముందున్న విశాలమైదానంలో గుమిగూడారు. వాళ్ళనుద్దేశించి వాళ్ళ నాయకుడు శుంభుడు, "మన రాజుగారు కొంతసేపట్లో ఇక్కడికి వస్తున్నాడు. ఆయనకు మనం ఘనంగా స్వాగతం పలకాలి!" అని హెచ్చరించాడు.

ఆ మాట విని అక్కడ గుమిగూడిన వాళ్ళంతా ఇళ్ళకు వెళ్ళి, రకరకాల రంగుల దుస్తులు ధరించి, మళ్ళీ అక్కడికి చేరి రాజు రాక కోసం ఉత్సాహంగా ఎదురు చూడసాగారు.

కొంతసేపటికివాళ్ళకు దూరంగా గుర్రాలు రావడం కనిపించింది. మొదట రెండు







గుర్రాల మీద ఇద్దరు సైనికులు జెండాలు పట్టుకుని వస్తున్నారు. వాళ్ళ వెనక ఆయుధాలు ధరించిన నలుగురు సైనికులూ, వారికి తరవాత రాజూ, యువరాణీ, వారికి ఇరువైపులా ఇద్దరు అంగరక్షకులూ, వారి వెనకగా దళనాయకుడూ, మరి ముగ్గురు అంగరక్షకులూ గుర్రాల మీద వస్తున్నారు.

రాజపరివారం వారిని సమీపించగానే, అంగరక్షకులు మొదట గుర్రాలపై నుంచి కిందికి దిగి, రాజూ, యువరాణీ ఉన్న గుర్రాల దగ్గరికి వెళ్ళారు. కొండజాతి నాయకుడు శుంభుడు రాజుకు చేతులెత్తి నమస్కరించాడు. రాజు మందహాసంతో గుర్రంపై నుంచి కిందికి దిగి, శుంభుణ్ణి ఆప్యాయంగా కౌగిలించుకుని, తన కుమార్తెను అతనికి చూపుతూ, "ఈమె నా కుమార్తె ప్రియంవద. అతడు దళనాయకుడు వీరసింహుడు," అని ఇద్దరినీ పరిచయం చేశాడు.

శుంభుడు రాజును దగ్గరున్న వృక్షం నీడలోకి తీసుకుపోయాడు. అక్కడ వెదుళ్ళతో చేసిన ఒక ఆసనం ఉన్నది. దాని పక్కనే ఉన్న మరొక ముక్కాలిపీట మీద యువరాణిని కూర్చోమని చెప్పి, రాజు, గుడ్డ పరిచిన వెదురు ఆసనంలో కూర్చున్నాడు. అప్పుడు కొండజాతి నాయకుడు, "మహారాజా! నిజంగా, మేమెంతో భాగ్యవంతులం! తమవంటి మహాప్రభువులు, ఈ దీనులను వెతుక్కుంటూ ఇంత దూరం రావడం మాకెంతో ఆనందంగా ఉన్నది. తమరినీ, యువరాణిగారినీ మామధ్య చూసుకున్న మహాభాగ్యాన్ని మా మనసులలో పదిలంగా దాచుకుంటాము," అన్నాడు ఆనంద బాష్పాలు రాలుస్తూ.

అంతలో కొందరు యువతులు పళ్ళాలలో ఏవో ఫలహారాలు తెచ్చి, రాజు ముందూ, యువరాణి ముందూ, ఆ తరవాత మిగతా రాజపరివారం ముందూ ఉంచారు. అందరూ వాటిని ఆరగిస్తూండగా అతి శ్రావ్యంగా డప్పుల చప్పుడు వినిపించింది. ఆ తరవాత కొందరు యువతులు వెదురు కర్రలను తెచ్చి, నిలువుగా అడ్డుగా పట్టుకున్నారు. వాళ్ళు, వెనక నుంచి విని







పిస్తూన్న డప్పుల సంగీతానికి అనువుగా కర్ర లను లయబద్ధంగా కదిలిస్తూంటే,అందంగా అలంకరించుకున్న మరికొందరు యువ తులు వచ్చి వాటి మధ్య చక్కగా నాట్యం చేయసాగారు. ఆ వెదురు కర్రల నాట్యాన్ని చూసి యువరాణి చాలా సంతోషించింది.

నాట్యం పూర్తయింది. రాజు ఆసనం నుంచి లేచి, తమ చుట్టూ వలయాకారంగా చేరిన అక్కడి స్త్రీ పురుషులనూ, పిల్లలనూ, పెద్దలనూ ఒకసారి కలయ జూశాడు. వాళ్ళందరూ ఆనందంతో చప్పట్లు కొట్టారు. ఆ తరవాత రాజు చేయి పైకెత్తి ఇలా అన్నాడు: "మీరు మాపైన చూపుతూన్న గౌర వాభిమానాలకు ఆనందంతో ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను. కొన్నాళ్ళ క్రితం ఇక్కడి నుంచి కొందరు యువకులు రాజ ధానీ నగరంలో జరిగిన ఆటల పోటీలలో పాల్గొని బహుమతులు గెలుచుకున్న విషయం కూడా మా కెంతో ఆనందం కలి గించింది. ఆ సందర్భంలో మీలో కొందరికి సైన్యంలో స్థానం కల్పించగలనని కూడా మాట ఇచ్చాను. ఆ మాటను నిలుపు కుంటాను. అయితే, ప్రస్తుతం నేను మరొక ముఖ్యమైన పనిమీద వచ్చాను. ఈ ప్రాంతా నికే కాదు; మాణిక్యపురి రాజ్యానికే ముసు పెన్నడూ కనీ వినీ ఎరగని పెద్ద ఆపద సంభ వించింది. అదేమిటంటే — మన దక్షిణ సముద్ర మధ్యం నుంచి ఒక రాకాసిమృగం ఇక్కడి కొండలలో పూచిన శతాబ్దిక పుష్పాల పరిమళం చేత ఆకర్షించబడి అర్ధరాత్రి సమయంలో వెలుపలికి వచ్చి, ఉత్తర దిశగా కొంతదూరం పయనించి, తెల్లవారే సరికి దిక్కు తెలియక మళ్ళీ సముద్రం చేరుతున్నది. అది అలా రావడంవల్ల సముద్ర తీరంలో దాని పాదాల కింద పడిన చెట్లు చేమలూ, ఇళ్ళూ, మనుషులూ, గొడ్డూ, గోదా సర్వం నేలమట్టమై పోతున్నాయి. ఆ భీకర మృగం అదృష్టవశాత్తు మీరు నివ సిస్తూన్న ఈ కొండ ప్రాంతానికి ఇంకా రాలేదు. అతిభీకరమైన ఆ రాకాసి మృగాన్ని ఎదిరించి పోరాడడం మానవ మాత్రులకు సాధ్యం కాని పని. కాబట్టి ఆ మృగాన్ని మన





రాజ్యంలో అడుగు పెట్టకుండా చేయ డానికి రాజగురువు సలహాతో ఒక పథకం ఆలోచించాను. రాకాసిమృగం శతాబ్దిక పుష్పాల చేత ఆకర్షించబడి ఉత్తర దిశగా వస్తున్నట్లు తెలుస్తున్నది. కాబట్టి, దానిని రాకుండా చేయాలంటే అది ఉన్న చోటికే ఆ పుష్పాలను చేర్చడం ఒక్కటే తరుణో పాయం. అందుకు మీ సహాయం కావాలి."

రాజు మాట్లాడడం పూర్తిచేసి కొంత సేపు అయింది కాని, ఎవరూ నోరు తెరవలేదు. నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ నాయకుడు శుంభుడు, "మహారాజా! రాజ్య రక్షణ కోసం ప్రాణా లర్పించడం మహాభాగ్యంగా భావించే వాళ్ళం మేము. ఆ రాకాసిమృగం ఆపద నుంచి మన రాజ్యాన్ని కాపాడడం మా కర్త వ్యంగా భావిస్తున్నాము. ఈ రోజు సముద్ర తీర ప్రాంతాలకు వచ్చిన ఆపద, రేపు మా ఈ కొండ ప్రాంతానికి రావచ్చు. ఆ విష యాన్ని మాకు తెలియజేసిన మీకు కృతజ్ఞ తలు తెలియజేస్తున్నాను. ఇప్పుడు మేము ఏం చేయాలో ఆజ్ఞాపించండి. తక్షణం నెర వేరుస్తాము," అన్నాడు.

నాయకుడి మాటలను ఆమోదిస్తున్నట్టు ప్రజలు చప్పట్లు చరిచారు. అంతలో జనం మధ్య నుంచి ఒక యువకుడు ముందుకు వచ్చి, రాజుకు నమస్కరించాడు.

అతన్ని చూడగానే యువరాణి ప్రియం వద రాజుతో, "విచిత్ర పుష్పాలను కానుకగా



ఇచ్చింది, ఈ యువకుడే!" అని చెప్పింది మెల్లగా.

"అవును, యువరాణీ! ఇంతటి ఆపద ముంచుకు వస్తుందని తెలియక ఆశతాబ్దిక పుష్పాలను మీకు ఇచ్చిన వాణ్ణి నేనే," అని రాజు కేసి తిరిగి, "ఇప్పుడే నేను శతాబ్దిక పుష్పాలతో రాకాసిమృగం ఉన్న చోటికి బయలుదేరుతాను, ఆజ్ఞాపించండి, మహా రాజా!" అన్నాడు యువకుడు.

"చాలా సంతోషం, ఉత్తుంగా! అందుకు మొదట మీ నాయకుడి అనుమతి తీసుకో," అన్నాడు రాజు.

ఉత్తుంగుడు తమ నాయకుడికేసి తిరిగి చూశాడు.



"శభాష్, ఉత్తుంగా! నీ సాహసానికి మెచ్చాను. అయినా, ఆ రాకాసిమృగాన్ని ఎలా లొంగదీసుకోవాలనుకుంటున్నావు?" అని అడిగాడు నాయకుడు.

"రాజుగారు సెలవిచ్చినట్టు, శతాబ్దిక పుష్పాలన్నిటినీ కోసి, ఒక పడవలో వేసుకుని రాకాసిమృగాన్ని వెన్నంటి వెళ్ళి దాని స్థావరంలో వాటిని పడవేస్తాను. ఆ తరవాత అది మాణిక్యపురికి రావలసిన అవసరమే ఉండదు కదా?" అన్నాడు ఉత్తుంగుడు.

"బావుంది. నువ్వు అలా వెళ్ళి తిరిగి రావడానికి కొన్ని రోజులు పట్టవచ్చు. అంత వరకు నీ కుటుంబాన్ని రక్షించే బాధ్యత మేము తీసుకుంటాము," అన్నాడు రాజు.

"ఉత్తుంగుడికి పెద్ద కుటుంబం అంటూ లేదు. చిన్నప్పుడే తల్లిదండ్రులు మరణించారు. ఒకే ఒక చెల్లెలు మాత్రమే ఉన్నది," అన్నాడు శుంభుడు.

అంతలో జనంమధ్య నుంచి ఒక పదిహేనేళ్ళ అమ్మాయి చేతిలో పూలమాలతో ముందుకు వచ్చింది.

"ఈమె, మా చెల్లెలు రజని!" అన్నాడు రాజుతో ఉత్తుంగుడు.

రజని, చేతిలోని మాలను యువరాణి మెడలో వేసింది. చుట్టూ ఉన్న జనం ఆనందంతో ఈలలు వేస్తూ, చప్పట్లు చరిచారు. యువరాణి చిన్నగా నవ్వుతూ, రజని చేయి పట్టుకుని, బుగ్గలు పుణికి, ఉత్తుంగుడి కేసి తిరిగి, "నువ్వు, వెళ్ళి తిరిగి వచ్చేంత వరకు మీ చెల్లెలు రజని రాజప్రాసాదంలోనే వుంటుంది," అని, రజనితో, "వస్తావు కదా?" అన్నది.

రజని సిగ్గుతో తలవంచుకుని అలాగే అని తల ఊపింది.

ఆ తరవాత రాజు శుంభుడితో, "ప్రియంవదకు శతాబ్దిక పుష్పాలంటే తీరని మక్కువ ఏర్పడింది. వాటిని రాజోద్యానంలో పెంచాలని కూడా ఆశపడింది. అయితే, అవి శాపగ్రస్తపుష్పాలని రాజగురువు హెచ్చరించడంవల్ల, ఆ ఆశ వదులుకున్నది. కాని, ఆ పుష్పాలను చూడాలన్న కోరికతోనే నా వెంట బయలుదేరి వచ్చింది. ఆ పుష్పా





లను దూరంనుంచయినా చూడడానికి వీల వుతుంది కదా?" అని అన్నాడు.

"చూడవచ్చు. అదేం కష్టంకాదు, మహా రాజా!" అన్నాడు శుంభుడు.

"తమరు అనుమతించారంటే నేనే యువ రాణిగారి వెంట వెళ్ళి ఆ పువ్వులను చూపి స్తాను. గుర్రాల మీద వెళితే త్వరగా తిరిగి రావచ్చు!" అన్నాడు ఉత్తుంగుడు.

"సరే, ఇప్పుడే బయలుదేరి త్వరగా వెళ్ళి రండి. నేను ఇక్కడే ఉంటాను. మీతో పాటు అంగరక్షకుణ్ణి కూడా తీసుకువెళ్ళండి," అని రాజు యువరాణితో చెప్పి శుంభుడితో, "పద గూడాన్ని చూద్దాం!" అన్నాడు.

ముందు యువరాణీ, ఉత్తుంగుడూ చెరొక గుర్రం మీదా, వారి వెనక, అంగ రక్షకుడు మరొక గుర్రం మీదా శతాబ్దిక పుష్పాలు పూచివున్న కొండలకేసి బయలు దేరారు. వాళ్ళు చాలా దూరం పయనం చేసి ఒక ఇరుకైన మార్గం చేరుకున్నారు. అప్పుడు ఉత్తుంగుడు, "యువరాణీ, ఇక్కడి నుంచి మీరు జాగ్రత్తగా, కాస్త నిదా నంగా గుర్రాన్ని నడిపించాలి. దారికి ఇరువై పులా ఉన్న చెట్ల కొమ్మలు మరీ కిందికి ఉంటాయి," అని హెచ్చరించాడు.

అలా కొంత దూరం వెళ్ళాక, "అదిగో, చూడండి ఆకాశాన్నంటుతున్న చెట్లకు పూచిన మెరుపుపువ్వుల్ని! అవే శతాబ్దిక పుష్పాలు!" అన్నాడు ఉత్తుంగుడు.



అద్భుతమైన ఆ దృశ్యం చూసి మయి మరచి పోయింది యువరాణి. కొండల మీద వెదురు పొదల్లా వున్న చెట్లపై మెరు పుల్లా మెరుస్తున్న ఆ ఎర్రటి పూలను చూసి ఆమె, "ఇంకా కొంచెం ముందుకు వెళ దామా!" అని అడిగింది.

"వద్దు యువరాణీ. గుర్రాలు ఇకపై ముందుకు వెళ్ళలేవు. కాలి నడకన వెళ్ళడం చాలా ప్రయాసతో కూడిన పని," అన్నాడు ఉత్తుంగుడు.

యువరాణి పుష్పాలను చూస్తూ అలాగే నిలబడిపోయింది. కొంతసేపయ్యాక ఉత్తుం గుడు, "ఇకబయలుదేరుదాం, యువరాణీ!" అన్నాడు.





"సుందరమైన ఈ పుష్పాలు శాపగ్రస్తాలు కావడం దురదృష్టకరం. అయినా, మరే దైనా అద్భుతం జరిగి, ఆ శాపం తొలగి పోగలదని అనుకుంటున్నాను," అంటూ ఆమె ఆ దృశ్యం కేసి మరొకసారి తనివి తీరా చూసి, గుర్రాన్ని వెనక్కు మళ్ళించింది.

వాళ్ళు గూడాన్ని చేరేసరికి, రాజు ప్రయాణానికి సిద్ధంగా ఉన్నాడు. తండ్రిని చూడగానే ఆమె, "చాలా అద్భుతమైన దృశ్యం చూశాను నాన్నా! అయినా, ఆ పుష్పాలు సేకరించడం చాలా కష్టమైన పని," అన్నది.

"కష్టమైన పనులు చేయాలంటే మాకు చాలా ఇష్టం, యువరాణీ!" అన్నాడు శుంభుడు.

రాజు ఉత్తుంగుణ్ణి దగ్గరికి పిలిచి, "నీ కార్యం విజయవంతం కావాలని కాంక్షిస్తున్నాను. నీరాక కోసం నేనే కాదు; మన రాజ్య ప్రజలందరూ ఎదురు చూస్తూ ఉంటాము. దేశ క్షేమం కోసం, శాంతి కోసం నువ్వు చేస్తున్న సాహసం ప్రశంసనీయం," అని చెప్పి, శుంభుడి కేసి తిరిగి, "ఉత్తుంగుడు బయలుదేరిన తరవాత, అతడి చెల్లెలు రజనిని రాజప్రాసాదానికి తీసుకురా," అంటూ ఆసనం నుంచి లేచి ముందుకు నడిచాడు.

యువరాణి, రజని భుజం మీద చేయి వేసి ఆప్యాయంగా ఆమె చేతిని స్పృశించి, గుర్రం మీదికి ఎక్కింది. ఆ తరవాత రాజు గుర్రాన్ని అధిరోహించాడు. ఆయన వెనక దళనాయకుడూ, ఆ పిమ్మట అంగరక్షకులూ గుర్రాల మీదికి ఎక్కారు.

శుంభుడు చేతులు జోడించి రాజుకు నమస్కరిస్తూ వీడ్కోలు చెప్పాడు. పరివారంతో రాజు ముందుకు కదిలాడు.

ఆ తరవాత శుంభుడు, ఉత్తుంగుడి భుజాన్ని ఆప్యాయంగా పట్టుకుని గూడెం కేసి నడుస్తూ, "నాయనా, ఉత్తుంగా! నీ సాహసం మెచ్చతగినది. నీ మూలంగా మన ఉత్తుంగ వంశానికి చిరకాలం నిలిచే కీర్తి లభిస్తుంది. నువ్వు తలపెట్టిన కార్యం అపాయకరమైనదే కాని, జగన్మాత కరుణా కటాక్షం వల్ల, నువ్వు విజయంతో సురక్షితంగా తిరిగి రాగలవు!" అన్నాడు ఎంతో ఆనందంగా.

— (ఇంకావుంది)





# విచిత్రపుష్పం

## 6

[మాణిక్యపురి రాజ్యాన్ని రాకాసి మృగం బారి నుంచి కాపాడడానికి, ప్రతాపవర్మ కొండజాతి యువకుల సాయం కోసం శృంగ్మాయ్ కొండలకు వెళ్ళాడు. యువరాణితోపాటు వచ్చిన రాజును చూసి అక్కడి ప్రజలూ, వాళ్ళనాయకుడుశుంభుడూఅమితానందంచెందారు. ఉత్తుంగుడు రాజు ఆనతినెరవేర్చగలనని ఆయనకు మాట ఇచ్చాడు. యువరాణి శతాబ్దిక పుష్పాలను చూసి వచ్చింది. రాజు సంతోషంగారాజధానికి వెనుదిరిగాడు. — తరవాత]

రాజు ప్రతాపవర్మ యువరాణితో కలిసి తమ నివాస స్థలానికి రావడం తలుచుకుని ఉత్తుంగ జాతి ప్రజలు ఆనందంతో ఉప్పొంగిపోయారు. రాజు తమ సహాయాన్ని కోరడం, రాజ్యానికి వచ్చిన ఆపదను అడ్డుకోవడానికి తమ జాతి యువకుడు ఉత్తుంగుడు వెళతాననడం వాళ్ళకెంతో ఆనందం కలిగించింది. తన ప్రయత్నంలో ఉత్తుంగుడు విజయం సాధించాలని అక్కడి ప్రజలు తమ కుల దేవతకు మొక్కుకున్నారు. ఆ యువకుడి గౌరవార్థం ఆరోజు సాయంకాలం విందు ఏర్పాటు చేశారు.

పెద్దలూ, పిన్నలూ గూడానికి సమీపంలో ఉన్న ఒక విశాల ప్రదేశంలో గుమికూడారు. వాళ్ళ నాయకుడు శుంభుడూ, ఇతర కుల పెద్దలూ కూర్చున్న స్థలానికి పక్కనే ఉత్తుంగుడికి ఉన్నత ఆసనం వేశారు. విందు ఆరగిస్తూ కులపెద్దలు, ఉత్తుంగుడు రాకాసి







మృగాన్ని ఎలా ఎదుర్కొంటే అతని పని సులభమవుతుందో దీర్ఘంగా ఆలోచించి చర్చించారు.

విందూ,వాళ్ళ చర్చలూ అయ్యాక, నాయకుడు శుంభుడు లేచి నిలబడి, "శతాబ్దిక పుష్పాలు పూచివున్న స్థలం మన ఉత్తుంగుడికి తెలుసు. కాబట్టి, రేపు తెల్లవారగానే అతనితో పాటు ఆరుగురు యువకులు వెళ్ళి ఆ పూలను సేకరించాలి. రాత్రివేళ రాకాసి మృగం వచ్చే అపాయం ఉన్నది గనక, పొద్దుగూకేలోగా ఆ పని పూర్తి చేయాలి. కోసిన పువ్వులను కట్టలుగా కట్టి ఒకచోట భద్రపరచి రాత్రికి గూడెం చేరుకోవాలి," అనికొంతసేపు ఆగి, "ఆ పుష్పాలను సముద్ర మధ్యానికి చేర్చాలంటే ఒక పడవ కావాలి. సముద్ర తీర ప్రాంతం నాశనమైపోయింది గనక, అక్కడ పడవలు లభించే అవకాశం లేదు. కాబట్టి, మనమే ఇక్కడొక పడవను తయారుచేసుకోవాలి. మీలో ఎవరికైనా పడవ తయారుచేయటం వచ్చా?" అని అడిగాడు.

జనం మధ్య నుంచి ఇద్దరు ముందుకు వచ్చి, "మేము కొన్నాళ్ళు సముద్ర తీర గ్రామాలలో వుండి వచ్చాము. అప్పుడు మేము పడవను తయారుచేసే పద్ధతి నేర్చుకున్నాము. మేము పడవను తయారు చేయగలం," అన్నారు.

"ఎన్ని రోజులలో సిద్ధం చేయగలరు?" అని అడిగాడు నాయకుడు.

"రెండు రోజులలో సిద్ధం చేయగలం, ప్రభూ!" అన్నారు వాళ్ళు.

"చాలా సంతోషం!" అని నాయకుడు జనం కేసి చూస్తూ, "మరి, రేపు పొద్దున ఉత్తుంగుడితో పాటు, పువ్వులు సేకరించడానికి ఎవరు వెళతారు?" అని అడిగాడు.

వెంటనే, నేనంటే నేను అంటూ యువకులందరూ చేతులెత్తారు.

"మీ ఉత్సాహానికి సంతోషం! అయినా, ఇంతమంది అవసరం లేదు. ఆరుగురు వస్తే చాలు," అంటూ ఉత్తుంగుడు అక్కడి వారిలో ఆరుగురిని ఏరి పక్కకు పిలిచాడు.

ఆ తరవాత ఉత్తుంగుడు, నాయకుడితో సహా అక్కడ చేరిన పెద్దలకు చేతులెత్తి





నమస్కరించి, వారి ఆశీస్సులు పొందాడు. నాయకుడుశుంభుడుఆప్యాయంగా ఉత్తుంగుడి భుజాన్ని తట్టాడు. ఉత్తుంగుడు నవ్వుతూ, చెల్లెలు రజనిని తీసుకుని తమ గుడిసెకు చేరుకున్నాడు.

మరునాడు తెల్లవారుజామునే ఉత్తుంగుడు ఆరుగురు మిత్రులను వెంటబెట్టుకుని, శతాబ్దిక పుష్పాలు పూచి వున్న కొండలకేసి బయలుదేరాడు. బారెడు పొద్దెక్కేసరికి వాళ్ళు ఆ చెట్లున్న కొండలను చేరి, పూలున్న చెట్లను గొడ్డళ్ళతో మొదలంట నరికి పడగొట్టారు. కిందపడిన ఒక్కొక్క చెట్టు చిటారు కొమ్మలలోని పువ్వులనూ కోసి కట్టలు కట్టలుగా కట్టసాగారు. సాయంకాలానికి పూలన్నిటినీ కోసి కట్టలు కట్టారు. ఉత్తుంగుడు అక్కడ కనిపించిన రెండు లేత మొక్కలను పెరికి, పూల కట్టలతో కట్టి, ఆ కట్టలను ఒక పెద్ద బండ రాయి వెనక భద్రపరచాడు. సూర్యుడు అస్తమిస్తూండగా ఏడుగురు మిత్రులూ సంతోషంగా గూడానికి వెనుదిరిగారు.

వాళ్ళు గూడాన్ని సమీపిస్తుండగా నాయకుడు ఎదురుపడి, "మీరు వెళ్ళిన పని పూర్తయింది కదా?" అని అడిగాడు.

"అయింది," అన్నాడు ఉత్తుంగుడు నవ్వుతూ.

"రేపు సాయంకాలానికి పడవ సిద్ధమవుతుంది. ఎల్లుండి, తెల్లవారుజామున మనం సముద్రతీరానికి బయలుదేరవచ్చు," అన్నాడు నాయకుడు పక్కన ఉన్న పడవను వాళ్ళకు చూపుతూ.





అతరవాత ఆయన ఉత్తుంగుడితో, "మీరు బాగా అలిసిపోయి వచ్చారు. వెళ్ళి నిద్రపొండి. నేను ఈ రాత్రికి వేరే కొందరిని గూడానికి కాపలా ఉంచుతాను," అన్నాడు.

ఉత్తుంగుడు సరేనని మిత్రులతో కలిసి వెళ్ళిపోయాడు.

అర్ధరాత్రి వరకు నాయకుడు కూడా కాపలా కాస్తున్న వాళ్ళతో కలిసి తిరిగాడు. ఆ తర వాత మిగతావాళ్ళు మరీమరీ చెప్పడంతో ఆయన ఇంటికి వెళ్ళి పడుకున్నాడు.

తెల్లవారగానే కాపలాఉన్నవాళ్ళు వచ్చి నాయకుడితో, "రాత్రి ఇటువైపు రాకాసి మృగం రాలేదు. కాని, ఎక్కడో చెట్లు కూలడం, బండరాళ్ళు దొర్లడం వంటి విచిత్ర ధ్వనులు దూరం నుంచి వినిపించాయి. నాలుగో జాము నుంచి ఆ ధ్వనులు కూడా క్రమంగా ఆగి పోయాయి," అని చెప్పారు.

"అలాగా! సరే, మీరు వెళ్ళండి," అన్నాడు నాయకుడు.

మరునాడు ఉదయం ఉత్తుంగుడు, నాయకుడి ఆజ్ఞ ప్రకారం మిత్రులతో కలిసి వెళ్ళి, మొదటి రోజు కోసి, కట్టలు కట్టి ఉంచిన శతాబ్దిక పుష్పాలను తీసుకువచ్చాడు. వాళ్ళు వచ్చేసరికి పడవ దగ్గర వాళ్ళ నాయకుడూ, ఉత్తుంగుడి చెల్లెలు రజనీ ఉన్నారు. పడవ సిద్ధంగా ఉన్నది. నాయకుడు ఆ పువ్వులను ఆశ్చర్యంతో కొంతసేపు పరీక్షగా చూశాడు. వాటి పరిమళం అక్కడి వారందరినీ ముగ్ధుల్ని చేసింది.

మరునాడు వేకువజామున నాయకుడూ, ఉత్తుంగుడూ తమ పరివారంతో బయలు దేరారు. నాయకుడు ముందూ, ఆయన వెనక ఉత్తుంగుడూ అతని చెల్లెలూ, వాళ్ళ వెనక పడవను భుజాలపై మోస్తూ నలుగురు దృఢకాయులూ దక్షిణ సముద్రం కేసి నడక సాగించారు.

గూడెం ప్రజలు పలువురు, కొంతదూరం వాళ్ళ వెనకగా వచ్చి వాళ్ళను సాగనంపారు.

పొద్దుగూకేలోగా సముద్రతీరం చేరుకోవా లన్న పట్టుదలతో వాళ్ళు వేగంగా నడిచి మధ్యాన్నానికి సగం దూరం చేరుకుని, ఒక వటవృక్షం కింద కొంతసేపు విశ్రాంతి తీసు







డికి అందించి, "ఇది, మార్గమధ్యంలో ఆకలి వేస్తే తినడానికి," అన్నది.

ఉత్తుంగుడు దానిని నవ్వుతూ అందుకుని, "నీకు ఎటువంటి కొరతా లేకుండా యువరాణి చూసుకుంటుంది. నేను త్వరలో తిరిగి వస్తాను. ఆ మాట యువరాణితో చెప్పు," అని మిత్రులకేసి ఒకసారి నవ్వుతూ చూసి, పడవ లోకి ఎక్కి తెడ్డును అందుకున్నాడు.

మిత్రులు పడవను నీళ్ళలోకి నెట్టారు. పడవ అలల మీద కిందికీ పైకీ లేస్తూ ముందుకు సాగింది. గట్టున ఉన్న వాళ్ళందరూ నవ్వుతూ చేతులెత్తి ఉత్తుంగుడికి వీడ్కోలు పలికారు. పడవ మరింత వేగంగా ముందుకు దూసుకుపోసాగింది.

కున్నారు. ఆ తరవాత బయలుదేరి సూర్యాస్తమయానికి ముందే సముద్రతీరం చేరారు. పడవను మోసుకొచ్చిన వాళ్ళు దానిని సముద్ర జలం దగ్గర దించారు. మిగతావాళ్ళు కట్టలు కట్టిన పువ్వులను పడవలో వేశారు. పువ్వుల నుంచి కమ్మని పరిమళం వీచింది. ఉత్తుంగుడు నాయకుడి పాదాలకు నమస్కరించాడు. నాయకుడు అతన్ని ఆప్యాయంగా లేవనెత్తి, "నీకు తప్పక విజయం సిద్ధిస్తుంది. మన కులదేవత కరుణతో నువ్వు త్వరగా జయప్రదంగా తిరిగి రాగలవు," అని ఆశీర్వదించాడు.

పక్కనే వున్న రజని, "నువ్వు, త్వరగా రావాలి అన్నయ్యా! నీకోసం ఎదురుచూస్తూంటాము," అంటూ అన్నం మూటను ఉత్తుంగు

పడవ కనుమరుగయ్యేంత వరకు అక్కడే నిలబడి దానికేసి చూస్తూ ఉండి, నాయకుడు వెనుదిరగగానే మిగతావాళ్ళు కూడా ఆయనను అనుసరించారు. నాయకుడు రజని భుజాన్ని ఓదార్పుగా తాకాడు. అందరూ మౌనంగా రాజధానీ నగరం కేసి నడవసాగారు.

దారిలో వాళ్ళకు నేలమట్టమైపోయిన చెట్లూ, నాశనమైపోయిన ప్రదేశాలూ కనిపించాయి. అంతటి భీకర పరిస్థితిని కేవలం మానవమాత్రులు కల్పించడం సాధ్యం కాదనీ, అతీతమైన బలం గల రాకాసిమృగం కారణంగానే అలా జరిగి ఉంటుందనీ వాళ్ళు అనుకుంటూ ముందుకు నడిచారు. రాత్రయ్యేకొద్దీ రాకాసిమృగం సముద్రం నుంచి వెలుపలికి

వచ్చే అపాయం వుంది కాబట్టి, ఆ ప్రాంతం నుంచి తప్పించుకోవడం మంచిదని వేగంగా నడవసాగారు. కొంతదూరం వెళ్ళాక దట్టమైన అడవి ఎదురయింది. ఆకాశం మేఘాలు కమ్ముకుని చీకటిగా ఉండడంతో వాళ్ళు ఇక ముందుకు వెళ్ళలేక ఒక చోట ఆగి, రాత్రంతా అక్కడే గడిపారు.

తూరుపు దిక్కున వెలుతురు కనిపించగానే, వాళ్ళు బయలుదేరి మధ్యాహ్నానికి రాజధానీ నగరం చేరారు. రాజప్రాసాదం చేరి కావలా భటులకు తమ రాకను తెలియజేశారు. రాజప్రాసాదం లోపల సేనాధిపతి గంభీర వర్మతో చర్చ జరుపుతున్న రాజు ప్రతాపవర్మ, వాళ్ళు వచ్చిన వార్త వినగానే సేనాధిపతితో సహా ఎదురువచ్చి, సాదరంగా ఆహ్వానించాడు.

"మాణిక్యపురిని ఆపద నుంచి రక్షించ డానికి మీరందరూ చూపుతున్న శ్రద్ధ మరువ రానిది. ప్రజలు మీ త్యాగనిరతిని కలకాలం గుర్తుంచుకుంటారు," అన్నాడు రాజు.

"మా బాధ్యతను నేరవేర్చడానికి ఒక అవ కాశం కలిగినందుకు మాకెంతో సంతోషంగా ఉన్నది, మహారాజా! నిన్న సాయంకాలమే ఉత్తుంగుడు శతాబ్దిక పుష్పాలను తీసుకుని రాకాసిమృగాన్ని వెతుక్కుంటూ సముద్రంలోకి వెళ్ళాడు," అన్నాడు కొండజాతి నాయకుడు శుంభుడు.

"అలాగా! అప్పుడేనా! చాలా సంతోషం!" అంటూ రాజు రజనికేసి తిరిగి, "రజనీ, ఇలా రా," అన్నాడు.

అంతలో, రజని రాక తెలిసి అక్కడికి వచ్చిన యువరాణి ప్రియంవద నవ్వుతూ రజని దగ్గరికి వెళ్ళి, "ఈ క్షణం నుంచి మన మిద్దరం స్నేహితులం!" అంటూ ఆమె భుజం మీద చేయివేసి, ఆమెను తన అంతఃపుర భవనం కేసి నడిపించింది.

"మా అన్నయ్య పడవ ఎక్కి బయలు దేరేప్పుడు, త్వరలో రాగలనని నీతో చెప్పమని చెప్పి వెళ్ళాడు," అన్నది రజని.

"అలాగా! చాలా సంతోషం! మీ అన్నయ్య విజయం సాధించి త్వరలో తిరిగి రాగలడన్న నమ్మకం నాకున్నది," అన్నది యువరాణి చిన్నగా నవ్వుతూ. — (ఇంకావుంది)



# విచిత్రపుష్పం

## 7

[రాజు ప్రతాపవర్మ కోరిక ప్రకారం, ఉత్తుంగుడు మిత్రులను వెంటబెట్టుకుని వెళ్ళి, శతాబ్దిక పుష్పాలను కోసుకుని వచ్చాడు. ఆలోగా పడవ సిద్ధమయింది. ఉత్తుంగ తెగ నాయకుడూ, చెల్లెలు రజనీ, మరి నలుగురు మిత్రులూ ఉత్తుంగుడి వెంట సముద్రం వరకు వచ్చి అతన్ని సాగనంపారు. ఉత్తుంగుడు శతాబ్దిక పుష్పాలతో, రాకాసి మృగాన్ని వెతుక్కుంటూ సముద్రమధ్యానికి పడవలో ఒంటరిగా ప్రయాణమయ్యాడు. — తరవాత]

ఉత్తుంగుడికి పడవ ప్రయాణంలో అనుభవం లేదు. శృంగ్మాయ్ కొండలలో సెలయేళ్ళే తప్ప పెద్ద నదులు లేవు. అక్కడ ఉన్న ఒక్కగానొక్క నది చిత్రావతి పొంగినప్పుడు, ఉత్తుంగుడు మిత్రులతో కలిసి తెప్పకొయ్యల మీద కొంత దూరం సరదాగా వెళ్ళివచ్చేవాడే తప్ప, పడవ నడపవలసిన అవసరం అతనికి అంతకు ముందెన్నడూ కలగలేదు. అయినప్పటికీ ఇప్పుడు మాణిక్యపురిని రాకాసిమృగం బారినుంచి కాపాడాలన్న దృఢసంకల్పంతో అతడు పడవను ముందుకు నడపసాగాడు. సముద్రంలో కొంతదూరం వెళ్ళాక అలల ఉధృతం తగ్గింది. చిన్న చిన్న అలల మీద పడవ వేగంగా నడిచింది. అలా కొంత దూరం వెళ్ళి, అది నిలకడగా ఉన్న నీళ్ళలోకి ప్రవేశించింది. ఇప్పుడు పడవ ముందుకు వెళ్ళాలంటే తెడ్డు ఉపయోగించవలసి వచ్చి, అతడు దానిని అందుకున్నాడు.







పడవకేసి రావడం అతడు గమనించాడు. అది ఏమై ఉంటుందా అని అతడు పరిశీలించి చూశాడు. ముఖం స్పష్టంగా కనిపించకపోయి నప్పటికీ దాని పెద్ద తలా, వెడల్పాటి భుజమూ, పెద్ద పెద్ద చేతులూ చూసి అది తప్పకుండా రాకాసిమృగమే అయివుంటుం దని ఉత్తుంగుడు గ్రహించాడు. అది కదిలే తీరును చూస్తుంటే, అంతగా లోతులేని నీళ్ళలో పెద్ద కాళ్ళతో మెల్లగా నడిచి వస్తున్నట్టు అతనికి అనిపించింది!

నడిసముద్రంలో రాకాసిమృగాన్ని ఎదు ర్కొనడం దుస్సాహసమవుతుందని అతడు భావించి, సమీపంలో భూభాగం కనిపించేంత వరకు దానికి అందకుండా వెళ్ళాలని నిశ్చ యించుకున్నాడు. పడవను వేగంగా నడు పుతూ, రాకాసిమృగం వస్తున్నదా లేదా అని అప్పుడప్పుడు తిరిగి చూస్తూ ప్రయాణం సాగించాడు. కొంతదూరం వెళ్ళేసరికి దూరంగా పెద్ద రాళ్ళగుట్ట కనిపించింది. ఆహా! భూప్రదేశం! అన్న ఆనందంతో అతడు దానిని సమీపించాడే తప్ప, తీరా దగ్గరికి వెళ్ళాక నేల మీద కాలుమోపడానికి చోటు లేదు. ఎటు చూసినా ఎత్తయిన బండలే ఉన్నాయి. పైగా, అక్కడ అలలు ఉవ్వెత్తుగా లేచి బండలను తాకుతూ ఉండడం వల్ల, పడవ మళ్ళీ, పైకీ కిందికీ ఊగిసలాడ సాగింది. దానిని అదుపులో పెట్టడానికి ఉత్తుంగుడు అతికష్టంతో ప్రయత్నించ

మెల్లమెల్లగా చుట్టుపక్కల చిమ్మచీకటి కమ్ముకోసాగింది. ఆకాశం మేఘాలు లేకుండా నిర్మలంగా ఉండడంతో, చుక్కలు పెట్టినట్టు నక్షత్రాలు ఒక్కొక్కటే మెరుస్తూ రాసాగాయి. మరికొంత సేపటికి ఎటుచూసినా గాఢాంధ కారం ఆవరించింది. రాకాసిమృగం ఏ క్షణంలోనైనా ఎటువైపు నుంచయినా నీళ్ళ నుంచి పైకి రావచ్చునన్న హెచ్చరికతో, ఉత్తుంగుడు జాగ్రత్తగా చుట్టుపక్కల కలయ చూస్తూ ముందుకు వెళ్ళసాగాడు. చాలా దూరం వెళ్ళాక హఠాత్తుగా అతని వెనక ఏదో నల్లటి ఆకారం కనిపించింది. ఉత్తుంగుడు వెంటనే పడవను వెనక్కు తిప్పాడు. ఆ నల్లటి ఆకారం క్రమక్రమంగా పెద్దదవుతూ





సాగాడు. అప్పుడు హఠాత్తుగా తాడిచెట్టు ప్రమాణంలో లేచిన ఒక రాక్షసఅల, పడవను అమాంతం లేపి బండల మధ్య ఉన్న ఒక ఇరుకు సందు గుండా వెలుపలికి విసిరి కొట్టింది. ఆ వేగానికి పడవ తల్లకిందుల యింది. ఉత్తుంగుడు ఎగిరి పడవ కవతల ఇసుకపై పడ్డాడు. పడవలోని పూల కట్టలు అతని తల మీద చెల్లాచెదురుగా పడ్డాయి!



క్షణాలలో జరిగిపోయిన ఈ హఠాత్ పరిణామానికి ఉక్కిరి బిక్కిరయిన ఉత్తుంగుడు మరుక్షణమే తేరుకుని, చెల్లాచెదరయిన పువ్వులను ఏరి పడవ దగ్గరికి తెచ్చాడు. ఆలోగా చాలా పువ్వులు నీళ్ళపై తేలుతూ వెళ్ళడం అతడు గమనించాడు. శతాబ్దిక పుష్పాలు ఇక్కడ ఉన్నాయి కాబట్టి, రాకాసి మృగం ఇటువైపు ఆకర్షింపబడి రావచ్చునని అతడు అనుకున్నాడు. అయితే, అక్కడ ఉన్న మార్గం మరీ ఇరుకుగా ఉన్నది. అది రాకాసిమృగం రావడానికి చాలినంతగా లేదు. మళ్ళీ పడవలో వెళ్ళి రాకాసిమృగాన్ని ఇటువైపు తీసుకువద్దామనుకున్నా అది సాధ్యమయ్యే పని కాదు. ఏం చేద్దామా అని ఆలోచిస్తూ అతడు అలాగే కొంతసేపు నిలబడ్డాడు. రాకాసిమృగం కనిపిస్తుందేమోనని మళ్ళీ ఒకసారి జాగ్రత్తగా చూశాడు. కాని, దాని జాడ కనిపించలేదు. చాలాసేపు గడిచింది. తూరుపు దిక్కున అప్పుడప్పుడే వెలుగు రేఖలు కనిపిస్తున్నాయి. ఆ సమయంలో అతనికి సముద్రంలో రాకాసిమృగం వీపు కనిపించింది. రాజుగారు తెలియజేసినట్టు, ఆ రాకాసిమృగం తెల్లవారక ముందే సముద్ర మధ్యాన్ని చేరుకుంటున్నదని అతడు గ్రహించాడు. మళ్ళీ పొద్దుగూకి రాత్రి అయ్యేంత వరకు అది సముద్రం వదిలి వచ్చే అవకాశం లేదని అతడు నిర్ణయించుకున్నాడు.

ఆ తరవాత అతడు తల్లకిందులుగా పడివున్న పడవను భుజంతో లేవనెత్తి సరిగ్గా ఉంచాడు. ఏరి వుంచిన శతాబ్దిక పుష్పాలనూ, మొక్కలనూ తీసి పడవలో ఉంచాడు. ఆ పువ్వులు ఇంకా అప్పుడే పూచినట్టు, సువాసనలు వెదజల్లుతున్నాయి. ఆ మొక్కలను నాటడానికీ, పువ్వులను దాచడానికీ సరైన







స్థలం ఏదా అని చుట్టుపక్కల పరిశీలించి చూశాడు. అప్పటికే బాగా తెల్లవారింది. ఆ తరవాత ఆలోచిస్తూ ఒక బండ మీద కూర్చుని, విశ్రాంతి కోసం కళ్ళు మూసుకున్నాడు. రాత్రంతా పడవ ప్రయాణం చేసి, బాగా అలిసిపోయి వుండడం వల్ల, కొంతసేపట్లోనే అతడు ఆదమరచి నిద్రపోయాడు!

అలా ఎంతసేపు నిద్రపోయాడో అతనికి తెలియలేదు. తల వెనక ఆడవాళ్ళ నవ్వులు వినిపించి ఉలిక్కిపడి లేచి, తను కల కనడం లేదుకదా అనుకుంటూ తలతిప్పి వెనక్కు చూశాడు. ఆరుగురు యువతులు బిలబిలమంటూ వచ్చి అతన్ని చుట్టుముట్టారు. వాళ్ళ వేషభాషలు విచిత్రంగా ఉన్నాయి. రంగురంగుల దుస్తులు ధరించి ఉన్నారు. కొప్పులనూ, చేతులనూ పువ్వులతో అలంకరించుకున్న వాళ్ళు ఏ కొండ జాతివాళ్లో అయివుంటారని ఉత్తుంగుడు భావించాడు. అయితే, వాళ్ళు మాట్లాడే భాష అతనికి అర్థం కాలేదు. ఆరుగురి యువతుల చేతులలోనూ శతాబ్దిక పుష్పాలు ఉన్నాయి. వాటిని సంతోషంగా వాసన చూస్తూ తమలో తాము ఏదో మాట్లాడుకుంటున్నారు. చేతులలోని పువ్వులను వాళ్ళు మళ్ళీ అక్కడే వుంచి ఎప్పుడు వెళ్ళిపోతారా అని కొంతసేపు ఎదురుచూశాడు. వాళ్ళు ఎంతకీ ఆ పని చేసేట్టు లేదు. దానిని గ్రహించిన ఉత్తుంగుడు, "నేను ఆ పువ్వులను మాణిక్యపురి నుంచి తెస్తున్నాను. ఒక ముఖ్యమైప పని మీద వాటిని దూర ప్రాంతాలకు తీసుకు వెళుతున్నాను. మీరు దయచేసి ఆ పువ్వులను పడవలో ఉంచండి! సూర్యుడస్తమించాక నేను ఇక్కడి నుంచి బయలు దేరాలి!" అన్నాడు.

రాకాసిమృగం గురించి చెప్పి వాళ్ళను బెదరగొట్టడం అతనికి ఇష్టం లేదు.

"మాణిక్యపురి! మాణిక్యపురి!" అంటూ ఆ యువతులు నవ్వారే తప్ప, మరేదీ మాట్లాడ లేదు.

ఉత్తుంగుడు పడవ దగ్గరికి వెళ్ళి నిలబడి, వాళ్ళకేసి చూస్తూ, "మీరు ఆ పువ్వులను ఇక్కడి నుంచి తీశారు కదూ?" అని అడిగాడు చేయి చూపుతూ.







"అవును," అన్నట్టు తలలు ఊపారు ఆ యువతులు.

"మరి, వాటిని మళ్ళీ అక్కడే ఉంచండి!" అన్నాడు సైగచేస్తూ.

ఆ యువతులు తలలు అడ్డంగా ఊపుతూ, ఏదో చెప్పారు. ఉత్తుంగుడికి ఆ మాటలు ఏ మాత్రం అర్థం కాలేదు. అతడు కోపంగా, "ఆ పువ్వులు నావి! మర్యాదగా వాటిని పడవలో ఉంచండి!" అని గద్దించాడు చేయి ఊపుతూ.

అయినా, వాళ్ళు పువ్వులను వాసన చూస్తూ పకపకమని నవ్వసాగారు. ఆఖరికి వాళ్ళలో ఒక యువతి ఉత్తుంగుణ్ణి సమీపించి, అతన్ని తాకి చేయెత్తి దూరంగా చూపుతూ ఏదో చెప్పింది.

"ఈ పువ్వులను తీసుకుని మేము ఇంటికి వెళుతున్నాము. నువ్వూ వస్తావా?" అని అడిగినట్లు ఆమె చేసిన సైగను బట్టి గ్రహించాడు.

మిగతా అయిదుగురు యువతులూ అప్పుడే అక్కడి నుంచి బయలుదేరారు.

"సరే, వస్తాను. నేను అక్కడికి వచ్చాక నా పువ్వులను నాకు ఇచ్చేయాలి!" అని ఉత్తుంగుడు వాళ్ళ వెంట బయలుదేరడానికి సిద్ధమవుతూ ఒకసారి పడవలోకి చూశాడు. అక్కడ ఒక్క పువ్వు కూడా లేదు. మొక్కలు మాత్రం ఉన్నాయి. పడవను అక్కడే వదిలితే, మళ్ళీ పెద్ద అల లేచి, దానిని సముద్రంలోకి లాక్కుపోవచ్చునన్న అనుమానంతో అతడు పడవను మరికొంత వెనకకు తోసి వదిలి పెట్టాడు. మొక్కలు అక్కడ ఉండడం అంత క్షేమం కాదని భావించి, వాటిని చేతిలోకి తీసుకుని, తెడ్డును పడవలో పడవేసి, యువతులకేసి తిరిగాడు. వాళ్ళు ఒకచోట ఆగి ఉత్తుంగుడి కోసం నవ్వుతూ ఎదురు చూస్తున్నారు.

ఉత్తుంగుడు చకచకా నాలుగు అడుగులు వేసి వాళ్ళను సమీపించాడు. వాళ్ళు మాట్లాడే భాషను అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ, అతడు వాళ్ళ వెనకగా కొంతదూరంలో మౌనంగా నడవసాగాడు. అతడు తమ వెంట వస్తున్నాడా, లేదా అని అప్పుడప్పుడు తిరిగి చూస్తూ ఆ యువతులు తమ నివాసం కేసి నడక సాగించారు.







కొంతసేపటికి వాళ్ళు ఇసుక ప్రదేశం దాటి, ఎర్రమట్టి ప్రాంతాన్ని చేరుకున్నారు. చుట్టూ కొండలతో ఆ ప్రాంతం ఒక లోతైన పళ్ళెంలా కనిపించింది. చుట్టూ చెట్టుచేమలతో పచ్చగా ఉన్నది కాని, పెద్ద వృక్షాలు కనిపించ లేదు. మరికొంత దూరం వెళ్ళేసరికి ఒక చిన్న గూడెం ఎదురయింది. వాళ్ళను చూడగానే గుడిసెల నుంచి వెలుపలికి వచ్చిన స్త్రీలు కొందరు ఆ యువతులను ఏదో అడిగారు. దానికి ఆ యువతులు ముక్తసరిగా సమాధానాలు చెబుతూ వెళ్ళి గూడెం మధ్యలో ఉన్న ఒక పెద్ద గుడిసెను సమీపించి, "అమ్మా, అమ్మా," అని పిలిచారు. కొంతసేపటికి ఒక మధ్యవయస్కురాలు తలుపు తెరుచుకుని వెలుపలికి వచ్చింది.

"మేము, ఏం తెచ్చామో చూడు. అందంగా ఉన్నాయి కదా?" అంటూ తాము తెచ్చిన పూలను చూపింది ఒక యువతి ఎంతో సంతోషంగా.

"చాలా అందంగా ఉన్నాయి! మంచి వాసన కూడా వేస్తున్నాయి! ఎక్కడి నుంచి తెచ్చారు?" అని అడిగిందా స్త్రీ.

"సముద్ర తీరానికి వెళితే ఆ యువకుడు ఒకచోట నిద్రపోతూ కనిపించాడు. అతని పక్కన ఒక పడవ, పడవలో ఈ పువ్వులు కనిపించాయి. అతడు మనకోసమే తెచ్చి ఉంటాడని వాటిని తీసుకున్నాము. అతడు మాణిక్యపురి నుంచి వచ్చినట్టున్నాడు. అతడేదో చెప్పాడు కానీ, మాకు అర్థం కాలేదు! మా వెంట పిలుచుకుని వచ్చాము. అందంగా ఉన్నాడు కదూ?" అంటూ ఒక యువతి ఉత్తుంగుణ్ణి చూపింది.

"అవును, చక్కగా ఉన్నాడు. కాబూయీ రానీ, అతనితో మాట్లాడి సంగతి తెలుసుకుంటాడు. ఇక మీరు లోపలికి వెళ్ళండి," అన్నదా స్త్రీ.

యువతులు ఆరుగురూ ఒకరి వెనక ఒకరు ఇంటి లోపలికి వెళ్ళారు. ఆ స్త్రీ ఉత్తుంగుణ్ణి కూర్చోమని సైగ చేసి లోపలికి వెళ్ళింది.

వాళ్ళేమి మాట్లాడుకున్నదీ ఉత్తుంగుడికి అర్థం కాలేదు. ఆ ఇంటిని బట్టి చూస్తే, అది





ఆ గూడెం నాయకుడిదై ఉంటుందని అతడు ఊహించాడు. లోపలికి వెళ్ళిన స్త్రీ, పళ్ళెం లాంటి ఒక పాత్ర నిండా ఏదో పానీయం తెచ్చి ఉత్తుంగుడికి ఇచ్చి, "బాగా అలిసిపోయినట్టున్నావు. దీనిని తాగు. కాబూయీ వచ్చాక మాట్లాడుతూ భోజనం చేద్దువు గాని!" అన్నది.

ఉత్తుంగుడు ఆ పాత్రను తీసుకుని, అందులోని పానీయాన్ని తాగి, పాత్రను పక్కన పెట్టాడు. దాపులనున్న ఒక గుంజకు ఆనుకుని కూర్చుని, యువతులు ఇంటి లోపలికి తీసుకువెళ్ళిన శతాబ్దిక పుష్పాలను గురించిఆలోచించసాగాడు:ఇక్కడున్న శతాబ్దిక పుష్పాల చేత ఆకర్షింపబడి సముద్రంలోని రాకాసిమృగం ఇటువైపు వచ్చిందంటే ఏం చేయాలి? అయినా, సముద్ర తీరంలో ఎత్తయిన గోడ కట్టినట్టు బండలున్నాయి. ఆ బండలను దాటుకుని రాకాసిమృగం వచ్చే అవకాశం లేదు. బండల మధ్య చిన్న ఇరుకు మార్గం మాత్రం ఉన్నది. ఆ మార్గం గుండా రాకాసిమృగం రావడానికి సాధ్యపడదు. పడవ తల్లకిందులయినప్పుడు సముద్రంలోకి కొట్టుకుపోయిన పువ్వులతో రాకాసి మృగం ప్రస్తుతానికి తృప్తి చెందవచ్చు. ఒకవేళ అవసరమైతే ఇక్కడి ప్రజలు తనకు సహాయ పడగలరా?

భుజాన్ని ఎవరో బలంగా తట్టడంతో ఉత్తుండుగు ఆలోచనల నుంచి బయటపడి, తల పక్కకు తిప్పి చూశాడు.

ఎదురుగా నిలబడ్డ ఒక దృఢకాయుడు, "ఎవరు నువ్వు?" అని అడిగాడు.

ఉత్తుంగుడికి ఆ ప్రశ్న అర్థం కాలేదు. అయినా అతడు, "మాణిక్యపురి రాజ్యం శృంగ్మాయ్ కొండల నుంచి వచ్చాను. నా పేరు ఉత్తుంగుడు!" అన్నాడు.

"శృంగ్మాయ్ కొండల నుంచి వస్తున్నావా? చాలా సంతోషం. లోపలికి వెళదాం, రా!" అంటూ ఇంటి లోపలికి దారితీశాడు దృఢకాయుడు.

అతనికి తమ భాష తెలుసు అని గ్రహించగానే, ఉత్తుంగుడు చాలా సంతోషంగా లేచి నిలబడ్డాడు. — (ఇంకావుంది)





# విచిత్ర పుష్పం

## 8

[శతాబ్దికపుష్పాలతో పడవలో బయలుదేరిన ఉత్తుంగుడికి అర్ధరాత్రి సమయంలో సముద్రమధ్యంలో రాకాసి మృగం కనిపించింది. ఉత్తుంగుడు భూప్రదేశం కోసం వెతుకుతూ ఉండగా ఒక పెద్ద అలలేచి, పడవను తీరానికి విసిరికొట్టింది. అతడు నిద్రలో ఉండగా కొందరు కోయయువతులు వచ్చి, శతాబ్దిక పుష్పాలను తీసుకుని తమ గూడానికి బయలుదేరారు. ఉత్తుంగుడు కూడా వాళ్ళ వెంట గూడెం చేరాడు. — తరవాత]

"శృంగ్మాయ్ కొండల ప్రాంతం నుంచి ఇంత దూరం ఇక్కడికి ఒంటిరిగా ఎలా వచ్చావు?" అంటూ కూర్చోవడానికి పరచి ఉన్న చాపను చూపాడు దృఢకాయుడు.

ఉత్తుంగుడు చాప మీద కూర్చుంటూ, "నేను మాణిక్యపురి దక్షిణ సరిహద్దు నుంచి నిన్న సాయంకాలం పడవలో బయలుదేరాను. తెల్లవారుతూ ఉండగా ఒక పెద్ద అలలేచి నా పడవను తీరం మీదికి విసిరి కొట్టడంతో గట్టు మీద పడ్డాను. అంతేగాని నేను ఇక్కడికి ఉద్దేశపూర్వకంగా రాలేదు," అన్నాడు.

అంతలో గుడిసె లోపలి గది నుంచి మధ్య వయస్కురాలు రెండు వెడల్పాటి పాత్రల నిండా ఏదో పానీయం తెచ్చి వాళ్ళ ముందు పెట్టి లోపలికి వెళ్ళింది.

దృఢకాయుడు తానొక పాత్ర తీసుకుని ఉత్తుంగుడికి మరొక పాత్ర చూపుతూ, "తీసుకో," అన్నాడు.







చుట్టూ కొందరు యువతులు చేరారు. పడవలో నేను తెచ్చిన పూలను తీసుకుని నిలబడ్డారు. వాళ్ళ మాటలు నాకు అర్థం కాలేదు కాని, వాళ్ళు చేసిన సైగలను అర్థం చేసుకుని వాళ్ళ వెంట ఇక్కడికి వచ్చాను," అన్నాడు. ఉత్తుంగుడు.

ఈ లోగా లోపలికి వెళ్ళిన స్త్రీ పూలకట్టను తెచ్చి, దృఢకాయుడి ముందు ఉంచి, "కాబూయీ, మన అమ్మాయి ఈ పూలను తెచ్చింది. అందంగా ఉన్నాయి కదూ!" అన్నది.

"బాగున్నాయి. అయినా, మన అమ్మాయి వాటినెందుకు తెచ్చింది?" అని అడిగాడు దృఢకాయుడు.

"అవి మంచి వాసన వేస్తున్నవి. అందువల్ల ఇష్టపడి తెచ్చుకున్నది," అన్నది స్త్రీ.

"ఆ యువకుడు వాటిని ఎక్కడికో తీసుకుని వెళుతున్నాడు! వాటినెందుకు ఇక్కడికి తేవాలి?" అని అడిగాడు దృఢకాయుడు.

ఆ స్త్రీ సమాధానం చెప్పకుండా మౌనంగా లోపలికి వెళ్ళిపోయింది. వాళ్ళ మాటలు అర్థంకాలేదు కాని 'కాబూయీ' అంటే నాయకుడు అన్న విషయం గ్రహించాడు ఉత్తుంగుడు.

"వీటిని శతాబ్దికపుష్పాలంటారు. ఒక ముఖ్యమైన పనిమీద పువ్వులను దూర ప్రాంతానికి తీసుకువెళుతున్నాను," అన్నాడు ఉత్తుంగుడు అసలు విషయాన్ని బయటపెట్టకుండా.

"మీ మాణిక్యపురికి సమీపంలో ఉన్న మా రాజ్యాన్ని నాగపురి అంటారు. ఇక్కడి

"నేనిక్కడికి రాగానే, ఆమె నాకు పానీయం ఇచ్చి నా ఆకలి తీర్చింది," అంటూ పాత్రను అందుకున్నాడు ఉత్తుంగుడు.

"ఇక్కడికి ఎప్పుడు వచ్చావు?" అని అడిగాడు దృఢకాయుడు.

"నేను ఇక్కడికి రాలేదు. నన్ను ఇక్కడికి తీసుకువచ్చారు," అన్నాడు ఉత్తుంగుడు.

"ఎవరు తీసుకువచ్చారు?" అని అడిగాడు దృఢకాయుడు.

పాత్రలో ఉన్న పానీయాన్ని తాగి పాత్రను కింద పెడుతూ, "గట్టుమీద పడవతో సహా ఎగిరి పడ్డ నేను, అప్పటికే బాగా అలిసిపోయాను. కొంతసేపు విశ్రాంతి తీసుకుందామని కళ్ళు మూశాను. మెలకువ వచ్చేసరికి





నుంచి నువ్వు ఇంకా ఎంత దూరం వెళ్ళాలి? ఆలోగా ఈ పువ్వులు వాడిపోతాయి కదా!" అన్నాడు కాబూయీ, ఉత్తుంగుడి నుంచి అన్నివిషయాలూ రాబట్టాలన్న ఉద్దేశంతో.

ఉత్తుంగుడు కూడా ఇక దాచి ప్రయోజనం లేదని గ్రహించి, తన ప్రయాణం గురించిన సంగతులన్నిటినీ కాబూయీకి క్లుప్తంగా వివరించాడు. అంతా విన్న కాబూయీ, "రాకాసి మృగాన్ని నడి సముద్రంలో ఎదుర్కోవడానికి సిద్ధపడిన నీ సాహసం మెచ్చతగినది. ఆపదలో ఉన్న మీ రాజ్యప్రజలను కాపాడడానికి పూనుకున్న నువ్వు ఆదర్శ యువకుడివి. ఆ రాకాసిమృగం వల్ల మా నాగపురికి ఎటువంటి ఆపదా రాదు. ఎందుకంటే మా రాజ్యం చుట్టూ ఎత్తయిన పర్వతాలు కోటగోడల్లా ఉన్నాయి. అది ప్రకృతి మాకు ప్రసాదించిన వరం. మా రాజ్యానికి శత్రువుల బెడదలేదు. మేము సుఖ శాంతులతో జీవిస్తున్నాము," అన్నాడు.

"నిజమే. అయితే , మా మాణిక్యపురికి సుదీర్ఘమైన సముద్రతీరం ఉన్నది. అందుకే రాకాసిమృగం మా రాజ్యంలో నానా బీభత్సం సృష్టిస్తున్నది. కాబట్టి దాని నివాసానికే ఈ పూలను చేర్చడం తప్ప మరొక మార్గం కనిపించడం లేదు," అన్నాడు ఉత్తుంగుడు.

"మీ కొండలలో పూచిన శతాబ్దిక పుష్పాలను కోయడానికి చెట్లన్నిటినీ మొదలంటనరికి పడగొట్టినట్టూ, అవి మళ్ళీ పూయడానికి వంద సంవత్సరాలు పట్టవచ్చుననీ ఇప్పుడే



కదా చెప్పావు. మరి రాకాసిమృగం ఆ పూల కోసం మాణిక్యపురికి వచ్చే అవకాశమే లేదు కదా?" అని అడిగాడు కాబూయీ.

"మీరన్నది నిజమే. అయినా ఆ దుష్ట మృగాన్ని మా రాజ్యం నుంచి వీలయినంత దూరం అవతలకి తీసుకు వెళ్ళాలన్న నిశ్చయంతో ఉన్నాను," అన్నాడు ఉత్తుంగుడు.

"నీ ప్రయత్నం మంచిదే. అయినా ఆ రాకాసి మృగాన్ని మీ రాజ్యానికి రాకుండా చేయడానికి మరేదైనా మార్గమున్నదేమో ఆలోచించడం మంచిదనుకుంటాను. ఈ విషయాలను మా రాజు గారికి చెప్పి ఆయన సలహా పొందడం అన్ని విధాలా మంచిదని భావిస్తున్నాను. భోజనం చేసి ఈ రోజే నిన్ను







మా రాజు మహేంద్రసింహుడి దగ్గరికి తీసుకు వెళతాను," అని ఉత్తుంగుడికి చెప్పి, లోపలి తలుపు తట్టాడు కాబూయీ.

ఇంటి లోపలి నుంచి ఆ స్త్రీ అక్కడికి వచ్చింది. కాబూయీ ఏదో చెప్పాడు. ఆమె లోపలికి వెళ్ళి మరుక్షణమే ఆహార పదార్థాలు తెచ్చి ఉత్తుంగుడి ముందు ఉంచింది. ఆమెవెంట మరొక యువతి కూడా వచ్చింది. పాత్రలను ఉంచి ఆమె లోపలికి వెళుతూండగా కాబూయీ ఆమెను 'చిత్రా' అని పిలిచాడు. ఆమె ఆగి, "పిలిచారా," అంటూ కాబూయీ కేసి తిరిగింది.

"అవును, ఇలా రా," అని కాబూయీ ఉత్తుంగుడి కేసి తిరిగి, "ఈమె మా కూతురు, చిత్ర," అని చెప్పి చిత్ర కేసి తిరిగి, "మిగతా వాళ్ళెక్కడ?" అని అడిగాడు.

ఆమె తలుపును చిన్నగా రెండు మూడు సార్లు తట్టింది. లోపలి నుంచి ఐదుగురు యువతులు అక్కడికి వచ్చారు.

కాబూయీ ఉత్తుంగిడితో, "వీళ్ళందరూ చిత్ర స్నేహితురాళ్ళు," అని చెప్పి వాళ్ళ కేసి తిరిగి, "ఈ పూలను పడవ నుంచి ఎందుకు తెచ్చారు?" అని అడిగాడు.

"పువ్వులు చాలా అందంగా ఉన్నాయి. మంచి వాసన వేస్తున్నాయి. అందుకే తీసుకు వచ్చాము," అన్నారు వాళ్ళు ఉత్తుంగుడి కేసి తదేకంగా చూస్తూ.

"సరే లోపలికి వెళ్ళండి," అన్నాడు కాబూయీ.

"అలాగే!" అంటూ ఆ యువతులు లోపలికి వెళ్ళారు.

భోజనం చేసి కాబూయీ, ఉత్తుంగుడూ రాజదర్శనానికి బయలుదేరారు. కాబూయీ భార్యా, కూతురూ వాళ్ళను వాకిలి వరకు వచ్చి సాగనంపారు.

గూడెం దాటగానే కాబూయీ, తన చేతిలోని పూలకట్టను ఉత్తుంగుడి చేతికిచ్చి, "ఇది నీ దగ్గరే ఉంచు," అని ముందు నడవ సాగాడు.

ఆ పూలను తీసుకుని ఉత్తుంగుడు కాబూయీ వెంట మౌనంగా నడవ సాగాడు. వాళ్ళు అలా చాలా దూరం వెళ్ళి ఎగుడు





దిగుడుగా ఉన్న ఒక చిన్న కొండను దాటి మరికొంత దూరం నడిచి నాగపురి రాజధానీ నగరాన్ని సమీపించారు.

రాజధానీ నగరవీధులలో నడుస్తూంటే పౌరులు కొందరు కాబూయీని గౌరవంగా పలకరించారు. ఎదురుగా వస్తూన్న మరి కొందరు పక్కకు తొలగి వాళ్ళకు దారి ఇచ్చారు. ఆజానుబాహువయిన కాబూయీ గంభీర రూపం, ఆయన తలమీద ఉంచు కున్న చిన్న నాగ కిరీటం, విచిత్ర వేషధారణ, చేతిలోని పెద్ద బల్లెం ఎదురుపడే వాళ్ళకు భయం కలిగిస్తున్నట్టు ఉత్తుంగుడు గ్రహిం చాడు.



వాళ్ళు రాజప్రాసాదాన్ని సమీపించగానే, కాపలాభటులు కాబూయీకి నమస్కరించారు. ఒక భటుడు వాళ్ళను రాజప్రాసాదం లోప లికి తీసుకుపోయాడు. ఇరువైపులా పెద్ద స్తంభాలతో మార్గం చాలా విశాలంగా ఉన్నది. వాళ్ళను ఒకచోట ఆగమని భటుడు మాత్రం లోపలికి వెళ్ళి, వాళ్ళు వచ్చిన సంగతి రాజుకు తెలియజేసి, తిరిగి వచ్చి కాబూయీనీ, ఉత్తుం గుణ్ణీ వెంటబెట్టుకుని రాజు దగ్గరికి వెళ్ళాడు.

రాజు ఉన్నతాసనం మీద కూర్చుని మంత్రు లతో ఏదో చర్చిస్తున్నాడు. రాజును చూడగానే, కాబూయీ చేతులు జోడించి వంగి నమస్క రించాడు.

"కాబూయీ! మీ కాభా తెగ ప్రజలం దరూ ఏ కొరతా లేకుండా క్షేమంగా ఉన్నారు కదా!" అని పరామర్శించాడు రాజు మంద హాసంతో.

"తమ దయ వల్ల అందరూ క్షేమంగానే ఉన్నాము, ప్రభూ!" అన్నాడు కాబూయీ.

రాజు దృష్టి ఉత్తుంగుడి మీద పడింది. ఉత్తుంగుడు కాబూయీ లాగానే చేతులు జోడించి వంగి రాజుకు నమస్కరించాడు.

"ఈ యువకుడు మాణిక్యపురి నుంచి వచ్చాడు. పేరు ఉత్తుంగుడు," అన్నాడు కాబూయీ.

"అలాగా! మీరాజు ప్రతాపవర్మ క్షేమంగా ఉన్నాడా?" అని అడిగాడు రాజు.

"క్షేమమే, ప్రభూ!" అన్నాడు ఉత్తుంగుడు వినయంగా.







"అలాగా! మాణిక్యపురి రాజు ప్రతాప వర్మ మన కోసం వీటిని అంత దూరం నుంచి పంపాడా?" అన్నాడు రాజు ఎంతో ఆశ్చర్యంగా.

"కాదు, ప్రభూ!" అంటూ కాబూయి శతాబ్దికపుష్పాల వల్ల మాణిక్యపురికి వాటిల్లిన ఆపద గురించీ, రాకాసిమృగాన్ని వెతుక్కుంటూ బయలుదేరిన ఉత్తుంగుడి ప్రయాణంగురించీ క్లుప్తంగా వివరించి, "ఈ విషయాన్ని తమకు తెలియజేసి, తమ సలహా పాటించడం మంచిదని ఉత్తుంగుణ్ణి వెంట బెట్టుకుని వచ్చాను, ప్రభూ," అన్నాడు కాబూయి.

"ప్రజలక్షేమం కోసం ఉత్తుంగుడు చేస్తున్న సాహసం ప్రశంసనీయమైనది. అయినా, అతడు ఆ రాకాసిమృగాన్ని ఎదుర్కోవడానికి ఒంటరిగా వెళ్ళడం అంత క్షేమం కాదు. ఈ సాహసవీరుడికి తోడుగా మన వీరులు మరి కొందరు వెళ్ళే ఏర్పాటు చేద్దాం," అన్నాడు రాజు.

అంతలో ఒక పదిహేనేళ్ళ అమ్మాయి, "నాన్నా! ఈ పువ్వులు ఎక్కడివి? ఇవి చాలా అందంగా ఉన్నాయి!" అంటూ అక్కడికి వచ్చింది.

రాజు ఆమెను ఆప్యాయంగా దగ్గరికి తీసుకుని, "వీటిని మాణిక్యపురి నుంచి నీ కోసం ఆ యువకుడు తెచ్చాడు," అన్నాడు చిన్నగా నవ్వుతూ.

పక్కనున్న ఆసనాలలో కూర్చోమని రాజు చేయి చూపగానే ఇద్దరూ ఆ ఆసనాలపై కూర్చున్నారు.

"ఉత్తుంగుడు అనుకోకుండా మన రాజ్యానికి వచ్చాడు," అంటూ కాబూయి ఉత్తుంగుడి చేతిలోని పూలకట్టను తీసి రాజు ముందుంచాడు.

"మీరు లోపలికి రాగానే వింత పరిమళం వీచింది. ఇదా కారణం!" అన్నాడు రాజు.

"ఉత్తుంగుడు వీటిని శృంగ్మాయ్ కొండల నుంచి తెచ్చాడు. ఇవి వంద సంవత్సరాల కొకసారి మాత్రమే పూచే విచిత్ర పుష్పాలట. అందుకే వీటిని శతాబ్దిక పుష్పాలని పిలుస్తారట!" అన్నాడు కాబూయి.

"నిజంగానా! నా కోసం తెచ్చావా?" అంటూ ఆ అమ్మాయి ఉత్తుంగుడి కేసి ఆశ్చర్యంగా చూసింది.

ఉత్తుంగుడు ఏం చెప్పడానికీ తోచక చిన్నగా నవ్వాడు.

రాజు అతనితో, "ఈమె నా కుమార్తె మల్లిక. ఈమెకు పువ్వులంటే ప్రాణం!" అన్నాడు.

"అవును, యువరాణీ! ఈ పువ్వులను మీ కోసమేతెచ్చాను," అన్నాడు ఉత్తుంగుడు.

"వీటిని నేను తీసుకుంటాను, నాన్నా!" అన్నది మల్లిక తండ్రితో.

"అలాగే తల్లీ! నువ్వు లోపలికి వెళ్ళు, నేను ఇప్పుడే వస్తాను," అని రాజు చెప్పగానే మల్లిక పూలను తీసుకుని సంతోషంగా లోపలికి వెళ్ళిపోయింది.

రాజు, "ఆ పుష్పాలకున్న శాపం గురించి గానీ, రాకాసిమృగం గురించి గానీ యువరాణికి తెలియకూడదు," అని కొంత సేపు మౌనంగా ఆలోచించి, "కాబూయీ, మీరీ రాత్రికి ఇక్కడే విశ్రాంతి తీసుకోండి. రాకాసి మృగం గురించి ఏం చేయాలో రేపు నిర్ణయిద్దాం!" అని చెప్పి అక్కడి నుంచి లేచి రాజభవనం లోపలికి నడిచాడు.

ఆయన వెళ్ళేంత వరకు మంత్రులూ, కాబూయీ, ఉత్తుంగుడూ లేచి నిలబడ్డారు. రాజు వెళ్ళాక ఒక మంత్రి కాబూయీతో, "మీరిద్దరూ నా వెంట రండి, మీకు బస ఏర్పాటుచేస్తాను," అని వాళ్ళను తీసుకుపోయి వాళ్ళకొక విశాలమైన గదిని చూపించి, "ఇక్కడ మీ అవసరాలన్నిటినీ సేవకులు చూసుకుంటారు. రేపు ఉదయం రాజుగారి నుంచి పిలుపు వచ్చేంత వరకు మీరిక్కడే విశ్రాంతి తీసుకోవచ్చు," అని చెప్పి వెళ్ళాడు.

మంత్రి వెళ్ళిన కొంతసేపటికల్లా ఒక భటుడు అక్కడికి వచ్చి, "తన కోసం పువ్వులు తెచ్చిన యువకుణ్ణి వెంటబెట్టుకుని రమ్మని యువరాణి ఆజ్ఞాపించారు!" అన్నాడు.

ఉత్తుంగుడు ఆశ్చర్యంగా కాబూయీ కేసి చూశాడు. కాబూయీ, "నువ్వు వెళ్ళిరా! అయితే, రాజుగారు చెప్పిన విషయం మాత్రం మరిచిపోవద్దు. జాగ్రత్త సుమా!" అని హెచ్చరించాడు. — (ఇంకావుంది)



# విచిత్ర పుష్పం

## 9

[శతాబ్దిక పుష్పాలతో రాకాసిమృగాన్ని వెతుక్కుంటూ వెళ్ళిన ఉత్తుంగుడు, అనుకోకుండా నాగపురి అనే నూతన ప్రదేశం చేరాడు. కోయదొర కాబూయీ ఉత్తుంగుణ్ణి ఆదరించి, రాజు దగ్గరికి తీసుకువెళ్ళాడు. ఉత్తుంగుడి సాహసాన్ని మెచ్చుకున్న రాజు, అతనికి తోడుగా కొందరు సైనికులను పంపుతానని మాట ఇచ్చాడు. ఆ రోజు సాయంకాలం, యువరాణి మల్లిక, ఉత్తుంగుణ్ణి వెంటబెట్టుకురమ్మని ఒక భటుణ్ణి పంపింది. — తరవాత]

ఉత్తుంగుణ్ణి వెంటబెట్టుకుని వెళ్ళిన రాజ భటుడు, అతన్ని రాజభవనంలోని ఒక విశాలమైనగదిలోకితీసుకుపోయి,"ఇక్కడే ఉండు, యువరాణిగారికి చెప్పి వస్తాను," అని లోపలికి వెళ్ళాడు.

ఉత్తుంగుడు అక్కడే నిలబడి, పక్కనున్న పెద్ద కిటికీ గుండా వెలుపలికి చూశాడు. ఆ గదిని ఆనుకుని కింద అందమైన ఉద్యానవనం కనిపించింది. అతడు దానికేసి చూస్తూండగా, కిటికీ ఎదురుగా ఉన్న ద్వారం గుండా లోపలికి వచ్చిన యువరాణి మల్లిక, "అప్పుడే వచ్చావా?" అంటూ పలకరించింది.

ఉత్తుంగుడు ఆమెకేసి తిరగగానే, "నీకు పువ్వులంటే ఇష్టం కదూ. మరి నాకూ పువ్వులంటే ఇష్టమని నీకెలా తెలిసింది. ఆ అందమైన పువ్వులను నేను గదిలో భద్రంగా దాచుకున్నాను. అది సరే, ఆ శతాబ్దిక పుష్పాలకు శాపం ఎలా కలిగింది?" అని అడిగింది యువరాణి.







లంటే అంత ఇష్టమని నాకు తెలియదు," అన్నది యువరాణి ఆశ్చర్యంగా కళ్ళు తిప్పుతూ.

ఉత్తుంగుడికి ఏం చెప్పడానికీ తోచక, "అవును, పువ్వులంటే నాకూ ఇష్టమే. అయితే నేనురాకాసిమృగాన్నికాను," అన్నాడు నవ్వుతూ.

"నిజమే, నువ్వు రాకాసిమృగానివి కాదు. కానీ, రాకాసిమృగాన్ని వెతుక్కుంటూ వెళుతూన్న సాహసవీరుడివి! అవునా?" అని అడిగింది యువరాణి చిన్నగా నవ్వుతూ.

"ఆ పువ్వులను మీకోసమే తెచ్చాను, యువరాణీ! నన్ను నమ్మండి," అన్నాడు ఉత్తుంగుడు.

"నమ్మాలనే ఉన్నది. కానీ," అంటూ ఏదో చెప్పడానికి సంశయిస్తూ ఉత్తుంగుడి కేసి చూసింది యువరాణి.

"ఇంతకూ నన్ను పిలిపించిన కారణం చెప్పనే లేదు," అన్నాడు ఉత్తుంగుడు.

"నువ్వు రాకాసిమృగాన్ని ఎదుర్కోవడానికి వెళుతున్నావు గనక, మేము రాకాసిమృగం వంటి ఒక శత్రువును ఎదుర్కోవడానికి నీ సహాయం కోరుతున్నాను," అన్నది యువరాణి.

"మీకు శత్రువులా యువరాణీ! నాగపురికి శత్రువులే లేరని చెప్పాడే కాబూయీ," అన్నాడు ఉత్తుంగుడు ఆశ్చర్యంగా.

"నిజమే. నాగపురికి వెలుపలి నుంచి శత్రువులు లేరు. మా నుంచే ఒక శత్రువు బయలుదేరాడు," అన్నది యువరాణి.

ఆ ప్రశ్నకు ఉత్తుంగుడు ఉలిక్కిపడి, మరుక్షణమే తేరుకుని, "శాపమా? ఎవరికి? శతాబ్దిక పుష్పాలకు శాపమేమిటి, యువరాణీ!" అన్నాడు ఏమీఎరగనట్టు.

"మా తండ్రితో మీరు చెప్పిన విషయం కొంత విన్నాను. ఉన్నట్టుండి భవనంలో సువాసన వీచడంతో, కారణం ఏమిటా అని మంత్రులతో చర్చలు జరుపుతున్న మా తండ్రి దగ్గరికి వచ్చాను. తండ్రి చేతిలోని పూల నుంచే ఆ సువాసన అని గ్రహించి, అటు సమీపిస్తున్నప్పుడు, ఆ పువ్వుల కోసం రాకాసిమృగం వస్తుందని కాబూయీ అనడంతో, అక్కడే ఆగి తెరచాటు నుంచి మీ మాటలు విన్నాను. అయినా, రాకాసిమృగానికి సైతం ఆ పువ్వు







ఎవరు? అన్నట్టుచూశాడు ఉత్తుంగుడు. "మరెవరో కాదు; మా మేనమామ నాగ సింహుడు. మా తండ్రి అతనికి సైన్యంలో దళనాయకుడి పదవి ఇచ్చాడు. అతడు దానితో తృప్తి చెందకుండా సేనాధిపతి పదవి కావాలని, తోబుట్టువయిన మా తల్లి ద్వారా తండ్రికి చెప్పించాడు. మా తండ్రి అందుకు ఒప్పుకోలేదు. దానికి ఆగ్రహం చెందిన మా మామ 'సేనాధిపతినే కాదు; నేను తలుచు కుంటే ఈ రాజ్యానికే రాజును కాగలను,' అని తన సహచరులతో గొప్పలు చెప్పుకోసాగాడు. ఆ విషయం తెలిసిన మా తండ్రి అతన్ని రాజ భవనంలో అడుగు పెట్టవద్దని మందలించి పంపేశాడు. నన్నూ, తల్లినీ అతని పట్ల జాగ్రత్తగా వ్యవహరించమని మా తండ్రి మాకు సలహా ఇచ్చాడు," అన్నది యువరాణి.

"ఇప్పుడు సేనాధిపతి ఎవరు?" అని అడిగాడు ఉత్తుంగుడు.

"దుర్జయుడు. మగ సంతానం లేనందు వల్ల, నన్ను ఈ రాజ్యానికి రాణిని చేయాలన్నది మా తండ్రి అభీష్టం. ప్రజల క్షేమమే తన క్షేమంగా భావించే మా తండ్రి కూడా నాగసింహుడి వల్ల ప్రజలకు ఎటువంటి హానీకలగ కూడదని అహర్నిశలు ఆలోచిస్తూన్నారని మా తల్లి ద్వారా తెలిసింది," అన్నది యువరాణి.

"ప్రజల క్షేమమే తన క్షేమంగా భావించే రాజుకు ఎటువంటి ఆపదా రాదు. సైనికుల కన్నా ప్రజలే రాజును రక్షించ గలరు. సరే, ఇప్పుడు నాగసింహుడు ఎక్కడున్నాడు?" అని అడిగాడు ఉత్తుంగుడు.

"మా తండ్రి సలహా మీద, సేనాధిపతిఅతన్ని కొందరు సైనికులతోపాటు ఉత్తర సరిహద్దు కాపలాకు పంపాడు. రోజూ అతన్ని గురించిన సమాచారం రాజుకు అందుతూనే ఉంటుంది. అయినా అతడు ఎంతోకాలం ఊరుకోడనీ, సింహాసనం కోసం కుట్ర చేయగలడనీ మా తల్లి భయపడుతున్నది. ఈ విషయం నీకు చెప్పడానికే పిలిపించాను. నువ్వు ఇక్కడే కొన్నాళ్ళు ఉంటేమంచిది," అన్నది యువరాణి.

"అలాగే, యువరాణీ! అయినా నేనొక ముఖ్యమైన పనిమీద దూరప్రాంతానికి వెళుతున్నాను. ఈ విషయంలో రాజుగారు కూడా

నాకు సహాయపడతానని మాట ఇచ్చారు," అన్నాడు ఉత్తుంగుడు.

"ఆ సంగతి నాకూ తెలుసు. నాగసింహుడి గురించి నేను నీతో చెప్పిన సంగతి ఎవరికీ తెలియకూడదు. ఏదైనా సమాచారం అందితే, నీకు తెలియజేస్తాను. ఇక నువ్వు వెళ్ళు," అన్నది యువరాణి.

ఉత్తుంగుడు భటుడివెంట విడిదిని చేరే సరికి, అక్కడ కాబూయీ అతని కోసం ఎదురు చూస్తున్నాడు. ఆయన అడగకముందే, "యువరాణి, శతాబ్దిక పుష్పం గురించి వివ రాలడిగింది. మనం రాజుతో చెప్పిన కొన్ని విషయాలు ఆమె విన్నట్టుంది. వంద సంవ త్సరాలకొకసారి పూచే అందమైన పుష్పం అదని చెప్పాను. అంతకుమించి నేను ఏమీ చెప్పలేదు," అన్నాడు ఉత్తుంగుడు యధాలా పంగా.

"మంచిపని చేశావు," అన్నాడు కాబూయీ మెచ్చుకోలుగా.

మరునాడు ఉదయం రాజు దగ్గరి నుంచి భటుడు రాగానే, కాబూయీ, ఉత్తుంగుడూ రాజదర్శనానికి వెళ్ళారు. వాళ్ళను చూడగానే రాజు, "నిన్న మనం అనుకున్నట్టు, ఉత్తుంగు డికి తోడుగా దళనాయకుడు నాగసింహుడితో పాటుసైనికులు మరికొందరిని పంపుతాను. నాగసింహుడు మన రాజ్యం ఉత్తర సరిహ ద్దులో ఉన్నాడు. అతడు రావడానికి రెండు మూడు రోజులు పట్టవచ్చు. అంతవరకు



ఉత్తుంగుణ్ణి ఇక్కడే ఉండనీ. నువ్వు కావా లంటే గూడానికి వెళ్ళు," అన్నాడు కాబూయీతో.

కాబూయీ, రాజుకు నమస్కరించి సెలవు తీసుకుని, ఉత్తుంగుణ్ణి అతని విడిదిలో వదిలి తన గూడానికి బయలుదేరాడు.

ఉత్తుంగుడు భోజనం చేసి, నగరంలోని వింతలను, విశేషాలను చూడడానికి బయలు దేరాడు. తీర్చిదిద్దినట్టున్న నగర వీధులు, వింత వింత భవనాలు అతనికి ఆశ్చర్యం కలిగించాయి. ఆ రాజ్యమెంతో సుభిక్షంగా, సుఖశాంతులతో తులతూగుతున్నట్టు ఉత్తుం గుడికి అనిపించింది. నాగసింహుడి కుట్ర ఫలితంగా రాజుకు ఏదైనా ఆపద కలిగితే ఆ రాజ్య ప్రజల గతి ఏమవుతుందో అని ఆలో



చిస్తూ ఉత్తుంగుడు సాయంకాలానికి తన విడిదినిచేరాడు. అలాగే రెండు రోజులు గడిచిపోయాయి. మూడవ రోజు సాయంకాలం, ఒక భటుడు వచ్చి, యువరాణి రమన్నట్టు చెప్పాడు. ఉత్తుంగుడు అతని వెంట రాజభవనానికి వెళ్ళాడు. అక్కడ అతని రాక కోసం ఎదురు చూస్తున్న యువరాణి, "మా మామ దళనాయకుడు నాగసింహుడు రాజధానికి వస్తున్నాడు. నువ్వు అతనిపట్ల జాగ్రత్తగా వ్యవహరించాలి. పైగా అతడు నాగపురిరాజ్య సింహాసనాన్ని కబళించడానికి ఏదైనా కుట్ర పన్నుతున్నాడా అని తెలుసుకోవడానికి ప్రయత్నించు. నువ్వు రాజుకు విశ్వాసపాత్రుడవని తెలిస్తే మాత్రం అతడు తన రహస్యం బయట పడనివ్వడు. సరే, నీ ప్రయాణం విజయవంతమయ్యాక తిరిగి ఇక్కడికి వస్తావా లేక అలాగే మాణిక్యపురికి వెళతావా?" అని అడిగింది.

"తప్పకుండా ఇక్కడికి వస్తాను. ఇక్కడి పరిస్థితులను చక్కదిద్ది మరీ వెళతాను, యువరాణీ!" అన్నాడు ఉత్తుంగుడు.

"నువ్వు చాకచక్యంతో మాట్లాడి నాగసింహుడి పథకాలను తెలుసుకున్నట్టయితే వాటిని భగ్నం చేయడం సులభమవుతుంది. ఈ విషయం చెప్పడానికే పిలిపించాను. ఇక వెళ్ళవచ్చు," అని లోపలికి వెళ్ళింది యువరాణి.

ఉత్తుంగుడు తన విడిదికి తిరిగి వెళ్ళాడు.

ఆ రోజే రాజ్యం ఉత్తర సరిహద్దుల నుంచి వచ్చిన దళనాయకుడు నాగసింహుడు సేనాధిపతి దుర్జయుడి దగ్గరికి వెళ్ళి, నమస్కరించి, "ఉన్నట్టుండి నన్నుపిలిపించిన కారణం ఏమిటి?" అని అడిగాడు.

"మాణిక్యపురి నుంచి కొన్ని పుష్పాలతో బయలుదేరి ఇటుగా వచ్చిన ఉత్తుంగుడనే యువకుడికి తోడుగా, నీ నాయకత్వంలో మన సైనికులు కొందరిని పంపాలని రాజుగారు నిర్ణయించారు!" అన్నాడు సేనాధిపతి.

"అతడు అసహాయశూరుడు కదా! ఇంత దూరం ఒంటరిగావచ్చిన వీరుడు, ఇకపైవెళ్ళలేడా?" అన్నాడు నాగసింహుడు ఎగతాళిగా.

"నిజమే! అతడు ఒంటరిగా వెళ్ళడానికే నిశ్చయించాడు. మనసహాయం ఆశించి రాలేదు. కాని అతడు వెతుక్కుంటూ వెళుతున్నది





ఒక రాకాసిమృగాన్ని. ఆ రాకాసిమృగం శతాబ్దిక పుష్పాల కోసం, మాణిక్యపురిలో ప్రవేశించి నానాబీభత్సం సృష్టిస్తున్నదట. కాబట్టి దానిని అటువైపు రానీయకుండా చేయడానికే దాని నివాస స్థానం వెతుక్కుంటూ శతాబ్దిక పుష్పాలతో కోయయువకుడైన ఉత్తుంగుడు బయలుదేరాడు. ప్రజలక్షేమం కోసం, ఒంటరిగా బయలుదేరిన అతని ధైర్యసాహసాలకు ముగ్ధుడైన మన రాజుగారు మన సైనికులను కొందరిని పంపడానికి నిశ్చయించారు," అన్నాడు సేనాధిపతి.

నాగసింహుడు కొంతసేపు మౌనంగా ఆలోచించి, "రాకాసిమృగాన్ని వెతుక్కుంటూ కేవలం ఒక కోయయువకుడు ఒంటరిగా బయలుదేరాడంటే మీరెలా నమ్మారు, సేనాధిపతీ?" అని అడిగాడు.

"మాణిక్యపురి నుంచి ఒంటరిగా ఇంత దూరం వచ్చిన ఆ యువకుడి మాటలను నమ్మకుండా ఉండలేము. పైగా, ఇది రాజాజ్ఞ! దానిని పాటించడమే మన బాధ్యత!" అన్నాడు సేనాధిపతి.

"చిత్తం, సేనాధిపతీ! మీ ఆజ్ఞను శిరసావహిస్తున్నాను. ఆయువకుణ్ణి ఎప్పుడు చూడమంటారు?" అని అడిగాడు నాగసింహుడు.

"రేపు ఇక్కడ ఇదే సమయానికి చూడవచ్చు! ఇక నువ్వు వెళ్ళు," అన్నాడు సేనాధిపతి.

నాగసింహుడు అక్కడినుంచి విసురుగా వెళ్ళిపోయాడు.



మరునాడు తెల్లవారగానే రాజుగారు రమ్మంటున్నారని ఒక భటుడు వచ్చి సేనాధిపతికి తెలియజేశాడు. సేనాధిపతి హుటాహుటిగా రాజభవనం చేరుకున్నాడు. రాజు గంభీర వదనంతో ఉన్నాడు. యువరాణి మల్లిక కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి.

"ఏం జరిగింది మహారాజా!" అని అడిగాడు సేనాధిపతి ఆతృతగా.

"శతాబ్దిక పుష్పాలు మాయమయ్యాయి. యువరాణి భవనంలో వాటిని దాచిన పూల కుండీలు అలాగే ఉన్నాయి. కాని పువ్వులు మాత్రం కనిపించడం లేదు. యువరాణి అంతఃపురంలో ప్రవేశించి ఇంత పనిచేసిన దుర్మార్గులు ఎవరై ఉంటారు? ఆ పూల





వాసన పరిచారికలందరినీ తప్పక ఆకర్షించి ఉంటుంది. అయినా, ఏ ఒక్కరు కూడా అవి ఎలా మాయమయ్యాయోచెప్పడం లేదు. ఆ పువ్వులు కనిపించలేదన్న విషయం, యువ రాణి స్వయంగా చూసి తెలుసుకున్నదే తప్ప, ఆ సంగతి అంతకు ముందు ఆమెకు ఎవరూ చెప్పలేదు. దొంగతనం అంత చాక చక్యంగా జరిగి ఉన్నది. ఆ పని ఎవరు చేసి ఉంటారో అంతుబట్టడం లేదు, సేనాధిపతీ!" అన్నాడు రాజు.

"రాజభవనం బాగా ఎరిగి ఉన్నవాళ్ళే ఈ పనిచేసి ఉండాలి. ఎందుకంటే రాజభవనం లోపలికి రాకాసిమృగం వచ్చే అవకాశం లేదు కదా?" అన్నాడు సేనాధిపతి.

"రాకాసిమృగమా? రాజభవనంలోకి రాకాసి మృగమా? మీరు ఏం చెబుతున్నారో అర్థం కావడం లేదు, సేనాధిపతీ!" అన్నది యువ రాణి ఆశ్చర్యంగా.

అంతలో రాజు కలగజేసుకుని, "అదేం లేదమ్మా, ఆ విషయం తరవాత చెబుతాను," అని, సేనాధిపతి కేసి తిరిగి, "ఇప్పుడా పుష్పాలను తిరిగి ఎలా సంపాయించాలో ఆలోచించాలి," అన్నాడు.

"చిత్తం, ప్రభూ! ఆ పనికి ఇప్పుడే మన భటులను పంపుతాను. అవి ఎక్కడున్నా సువాసనలు వెదజల్లుతూ ఉంటాయి కదా? కాబట్టి, తెలుసుకోవటం సులభం. దాంతో పాటు నిన్నటి నుంచి రాజభవనంలోకి ఎవ రెవరు వచ్చారో కాపలా భటులను అడిగి తెలుసుకుంటాను," అని కొంతసేపు ఆగి, "మరొక విషయం మహారాజా! నిన్ననే దళ నాయకుడు నాగసింహుడు వచ్చాడు. సైనికుల తోసహా ఉత్తుంగుడి వెంట వెళ్ళడానికి సమ్మ తించాడు, మహారాజా!" అన్నాడు సేనాధిపతి.

"నాగసింహుడు వచ్చాడా! నిన్నటి నుంచి రాజధానిలో ఉన్నాడా? శభాష్! అందుకే చిత్ర విచిత్రమైన సంఘటనలు జరుగుతున్నాయి!" అని కొంచెంసేపు మౌనంగా ఆలోచించి, "మొదట మీరు పుష్పాలు ఎక్కడున్నాయో వెతికి తెప్పించండి. ఆ తరవాత ఉత్తుంగుడి ప్రయాణం ఎప్పుడో నిర్ణయిద్దాం!" అన్నాడు రాజు.

—(ఇంకావుంది)





# విచిత్రపుష్పం

10

[ఉత్తుంగుడి సాహసాన్ని మెచ్చుకున్న నాగపురి రాజు అతనికి తోడుగా మరికొందరు భటులను పంపుతానని మాట ఇచ్చాడు. నాగపురి రాజకుమారి మల్లిక ఉత్తుంగుణ్ణి పిలిపించి, నాగపురి సింహాసనానికి నాగసింహుడు కుట్ర పన్ను తున్నాడని చెప్పి, దానిని విచ్ఛిన్నం చేయడానికి ఉత్తుంగుడి సహాయం కోరింది. యువరాణి భవనంలోని శతాబ్దిక పుష్పాలు కనిపించకపోవడంతో విస్మయం చెందిన రాజు వాటిని వెతికించమని సేనాధిపతిని కోరాడు. — తరవాత]

రాజభవనం నుంచి వెలుపలికి రాగానే, సేనాధి పతి ఉత్తుంగుడి కోసం కబురు పంపాడు. శతాబ్దిక పుష్పాలను వెతికే బాధ్యతను దళ నాయకుడు నాగసింహుడికి అప్పగిద్దామా అన్న ఆలోచన అయనకు కలిగింది. కానీ, దళనాయకుడు రాజధానిలో ఉండడం రాజు గారికి ఇష్టం లేదు గనక, ఆ పనిని అతనికి అప్పగించడం మంచిది కాదని నిశ్చయిం చుకున్నాడు.

శతాబ్దిక పుష్పాలను గురించి ఆలోచిస్తూ సేనాధిపతి తన భవనానికి చేరిన కొంతసేప టికి ఉత్తుంగుడు అక్కడికి వచ్చి, ఆయనకు నమస్కరించి, "మేము ఎప్పుడు బయలు దేరాలి? నా పడవ సముద్ర తీరంలోనే ఉన్నది. మిగతా పడవలు సిద్ధమయ్యాయా? నేను ఇక్కడికి తెచ్చిన పువ్వులు పోను, మిగతావి కాబూయా ఇంటి దగ్గరే ఉన్నాయి. మేము ఎప్పుడు బయలుదేరుతామో తెలిస్తే, ఆ







పువ్వులను కూడా తెచ్చుకోవచ్చు," అన్నాడు ఉత్సాహంగా.

"పడవలు సిద్ధమవుతున్నాయి. ఈలోగా నీతో పంపవలసిన భటులను ఎంపిక చేస్తున్నాము. నీకు తోడుగా పంపడానికి దళనాయకుడు నాగసింహుణ్ణి కూడా పిలిపించాము. ఎప్పుడు వెళ్ళాలి? ఎలా వెళ్ళాలి? రాకాసి మృగాన్ని ఎలా ఎదుర్కోవాలి? మొదలైన విషయాలను గురించి నీతో చర్చించడానికి నాగసింహుడు వస్తానన్నాడు," అన్నాడు సేనాధిపతి.

"ఎప్పుడు వస్తానన్నాడు?" అని అడిగాడు ఉత్తుంగుడు.

"ఈపాటికే వచ్చి ఉండాలి. మరి రాని కారణం తెలియదు," అని సేనాధిపతి చెబుతూన్నంతలో దళనాయకుడు నాగసింహుడు అక్కడికి వచ్చాడు.

"నాగసింహా! ఇతడే నేను చెప్పిన యువకుడు ఉత్తుంగుడు. నువ్వు తోడుగా వస్తున్నావని తెలిసి చాలా ఉత్సాహంగా ఉన్నాడు. ఈ యువకుణ్ణి నీ శిబిరానికి తీసుకుని వెళ్ళి, ప్రయాణం గురించిన వివరాలు తెలుసుకో. ఎప్పుడు ఎలా వెళ్ళాలి? ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి? మొదలైన విషయాలను ఇరువురూ చర్చించి నిర్ణయించండి. ఈ యువకుడి ప్రయాణం తప్పకుండా విజయవంతం కావాలని రాజుగారు ఆశిస్తున్నారన్న విషయం మరిచిపోవద్దు. ఇరువురూ మాట్లాడుకుని ఎప్పుడు బయలుదేరాలో తెలియజేయండి," అన్నాడు సేనాధిపతి.

నాగసింహుడు చిన్నగా నవ్వి, "చిత్తం, సేనాధిపతీ! మా సముద్ర ప్రయాణం గురించిన పథకం సిద్ధం చేసుకుని, సాయంకాలానికి మీ దగ్గరికి వస్తాము," అని ఉత్తుంగుడివైపు తిరిగి, "వెళదామా," అంటూ వెనుదిరిగి వెలుపలికి నడవసాగాడు.

ఉత్తుంగుడు అతన్ని అనుసరించాడు. ఇద్దరూ దాపులనే ఉన్న సైనిక శిబిరానికి చేరారు. తన గదిలో ప్రవేశించేంత వరకు నాగసింహుడు ఒక్క మాట కూడా మాట్లాడలేదు. ఉత్తుంగుడు కూడా మౌనంగానే నడిచాడు. నాగసింహుడు తన గదిలో ఉన్న ఒకే ఒక ఆసనంలో కూర్చుని, ఉత్తుంగుణ్ణి





ఎదుట ఉన్న ముక్కాలిపీట మీద కూర్చో మన్నాడు.

ఉత్తుంగుడు కూర్చున్నాక, "రాజుతో సహా అందరూ నీ ప్రయాణం మెచ్చుకుంటూ తెగ మురిసి పోతున్నారు గదా! ఇప్పుడు చెప్పు, నువ్వు చేస్తున్న ఆ సాహస ప్రయాణం ఏమిటో?" అని అడిగాడు నాగసింహుడు హేళనగా.

అతని ధోరణిని చూసి ఉత్తుంగుడు గతుక్కుమన్నాడు. అయినప్పటికీ ఆ క్షణమే తేరుకుని, ఏ మాత్రం తొణక్కుండా తన ప్రయాణం గురించిన వివరాలన్నిటినీ పూస గుచ్చినట్లు వివరించాడు. అంతా విన్న నాగ సింహుడు, "ఇంత దూరం ఒంటరిగా వచ్చిన సాహసవీరుడివి ఇక్కడి నుంచి ఒంటరిగా వెళ్ళలేవా? నీ అచంచలమైన ధైర్యం ఇంతలో ఏమైపోయింది?" అన్నాడు మరింత పరిహా సంగా.

"నేను ఒంటరిగా వెళ్ళడానికే వచ్చాను. అసలు ఇక్కడ మీ రాజ్యం ఉన్న సంగతి కూడా నాకు తెలియదు. అయితే, మీ రాజు కరుణామూర్తి. నామీద కరుణజూపి నాకు తోడు పంపుతానన్నాడు. మరొక్క విషయం ఏమంటే రాకాసిమృగాన్ని ఉపాయంగా మానవ నివాసానికి సాధ్యమయినంత దూరా నికి తీసుకునివెళ్ళి వదిలిపెట్టడం నా ధ్యేయం. అలా చేయడం వల్ల ఒక్క మాణిక్యపురికి మాత్రమే కాదు; మీ నాగపురికి కూడా ఆ



మృగం నుంచి రక్షణ లభిస్తుంది," అన్నాడు ఉత్తుంగుడు.

"నాగపురి రాజ్యం గురించి నీకు విచారం వద్దు. ఒక్క రాకాసిమృగమే కాదు; ఇతర శత్రువులు ఎవరు వచ్చినా సరే మా రాజ్యాన్ని కాపాడుకోవడానికి మేము ఉన్నాం. అందుకు నీ సహాయం అవసరం లేదు. అది సరే, రాకాసిమృగాన్ని చూశానంటున్నావు. అయినా, ఈ కాలంలో రాకాసిమృగాలు ఎక్కడివి? నువ్వు చెప్పే కాకమ్మ కథ నమ్మడానికి వినే వాళ్ళందరూ అమాయకులు కారు!" అన్నాడు నాగసింహుడు పరిహాసంగా నవ్వుతూ.

"మీరు నమ్మినా, నమ్మకపోయినా ఇది ముమ్మాటికీ నిజం! ఆ రాకాసిమృగాన్ని



నేను కళ్ళారా చూశాను. అంతే కాదు; అది మాణిక్యపురి సముద్ర తీరంలో సృష్టించిన బీభత్సాన్ని మా సైనికులు ప్రత్యక్షంగా చూశారు. అది పాదం మోపిన చోటల్లా ఇళ్ళూ, చెట్టు చేమలూ నేలమట్టమైపోయాయి. అందువల్లే దానిని ఎదిరించి పోరాడడం లాభం లేదనీ, వీలయినంత దూరానికి తీసుకునివెళ్ళి వదిలి పెట్టాలని నిర్ణయించారు మా రాజు. శతాబ్దిక పుష్పాల కోసమే ఆ రాకాసిమృగం మాణిక్య పురికి వస్తున్నట్టు కూడా తెలిసింది. అందుకే ఈ పుష్పాల సాయంతో దానిని సుదూర ప్రాంతానికి చేర్చడానికి నేను బయలుదేరాను. ఒకవేళ మీకు రాకాసిమృగం అంటే భయంగా వుంటే మీరు రాకండి. నేను ఒంటరిగానే వెళతాను," అన్నాడు ఉత్తుంగుడు దృఢమైన కంఠస్వరంతో.

"భయమా! నాకా! రాకాసిమృగాన్ని చూసి నేను భయపడతానా? ఛీ ఛీ, భయమంటే ఎరుగని వీరుణ్ణి నేను. పైగా, ప్రాణాలకు తెగించి పోరాడడానికి శిక్షణ పొందిన దళ నాయకుణ్ణి నేను అన్న విషయం మరిచి పోయావా?" అని అడిగాడు నాగసింహుడు.

"మాణిక్యపురిలోనూ శిక్షణ పొందిన సైనికులూ, దళనాయకులూ చాలామంది ఉన్నారు. అయినా, వాళ్ళు రాకాసిమృగం ముందు తమ శక్తిసామర్థ్యాలు ఫలించవని గ్రహించారు. అందుకే మృగం బారి నుంచి తప్పించుకోవడానికి ఈ ఉపాయం ఆలోచించాము," అన్నాడు ఉత్తుంగుడు.

"సరే, ఆ సంగతి అలా వుంచు. నువ్వు తెచ్చిన పుష్పాలు ఇప్పుడు ఎక్కడున్నాయి? నీ గదిలో ఉన్నాయా? అవి మొత్తం ఎన్ని ఉంటాయి? రెండా? మూడా?" అని అడిగాడు నాగసింహుడు.

"చాలానే ఉన్నాయి. పూచిన పువ్వులన్నిటినీ సేకరించి తెచ్చాను. పడవ తల్లకిందులయినప్పుడు కొన్ని సముద్రం పాలయ్యాయి. ఇప్పుడు ఒక కట్ట పువ్వులను రాజుగారికి ఇచ్చాను. మిగిలిన పువ్వులు కోయదొర కాబూయీ దగ్గర ఉన్నాయి. బయలుదేరే ముందు మనం వాటినన్నిటినీ తెచ్చుకోవాలి," అన్నాడు ఉత్తుంగుడు.







"అంటే, ఆ పువ్వులను చూడాలంటే, నేను రాజభవనానికి వెళ్ళాలన్న మాట!" అన్నాడు నాగసింహుడు.

"అవును. కానీ," అంటూ ఏదో చెప్పబోయి ఆగిపోయాడు ఉత్తుంగుడు.

"కానీ ఏమిటి? ఆ పువ్వులు రాజభవనంలో లేవా?" అని గద్దించాడు నాగసింహుడు.

"రాజుగారి దగ్గరి నుంచి ఆ పువ్వులను యువరాణి తీసుకుపోవడం మాత్రమే చూశాను. రాజభవనంలో అవి ఎక్కడ ఉన్నవో నాకు తెలియదు," అన్నాడు ఉత్తుంగుడు.

"ఆ విచారం నీకు వద్దు. ఆ విషయం నేను రాజునే వెళ్ళి అడగగలను. మహారాణి మా అక్కగారన్న విషయం నీకు తెలుసా?" అని అడిగాడు నాగసింహుడు నవ్వుతూ.

"అలాగా! ఆ సంగతి ఇప్పుడే తెలిసింది. చాలా సంతోషం," అన్నాడు ఉత్తుంగుడు ఆ విషయం తనకు అంతకు ముందే తెలుసునన్న విషయం బయటపెట్టకుండా.

"మనం ఎప్పుడు వెళ్ళాలో ఆలోచించి, నీకు తెలియజేస్తాను. ఆ తరవాత ఇద్దరం కలిసి సేనాధిపతి దగ్గిరికి వెళదాం. అంత వరకు నువ్వు నీ విడిదిలోనే ఉండు!" అన్నాడు నాగసింహుడు.

ఉత్తుంగుడు అక్కడినుంచి బయలుదేరి తన విడిదికి వెళ్ళాడు. అక్కడ కూర్చుని ఎవరి నుంచి ఎప్పుడు ఏ కబురు వస్తుందో అని ఎదురుచూడసాగాడు. కానీ మధ్యాన్నం దాటినా ఎవరూ రాలేదు. సాయంకాలమై పొద్దు గూకింది. అయినా, దళనాయకుడి నుంచి గాని, సేనాధిపతి నుంచి గాని, రాజు లేక యువరాణి నుంచి గాని ఎలాంటి సమాచారమూ రాలేదు. అందువల్ల రాజభవనంలో యువరాణి గది నుంచి శతాబ్దిక పుష్పాలు కనిపించకుండా పోయిన సంగతి కూడా అతనికి తెలియదు.

మరునాడు తెల్లవారి, పొద్దెక్కిన కొంత సేపటికి కోయదొర కాబూయీ ఉత్తుంగుడి విడిదికి హడావుడిగా వచ్చాడు. అతన్ని చూడగానే, "ఏమయింది కాబూయీ?" అని అడిగాడు ఉత్తుంగుడు ఆదుర్దాగా.

"నువ్వు తీసుకువచ్చిన శతాబ్దిక పుష్పాలు కనిపించలేదు! నువ్వు వచ్చినప్పుడు తిరిగి ఇవ్వాలనీ, వాటిని జాగ్రత్తగా దాచమనీ నేను నా కుమార్తె చిత్రకు మరీ మరీ చెప్పాను. ఆమె కూడా వాటిని తన స్నేహితురాళ్ళకు కూడా ఇవ్వకుండా తన గదిలోనే భద్రంగా దాచింది. ఈరోజు తెల్లవారి లేచి చూసేసరికి పువ్వులు కనిపించలేదు. ఆమె పువ్వులు దాచిన గదిలోకి రాత్రి ఎవరూ వచ్చినట్టు అలికిడి లేదు. తనను ఆటపట్టించడానికి తన స్నేహితురాళ్ళేమయినా తీసి దాచారేమో అని చిత్ర వెళ్ళి వాళ్ళను అడిగింది. అయినా, వాళ్ళకేమీ తెలియదన్నారు. పువ్వులు ఎలా పోయాయో ఏమాత్రం అంతుబట్టడం లేదు. అంతా మాయగా ఉన్నది. అక్కడికి రాకాసి మృగం వచ్చే అవకాశం లేదు కదా!" అన్నాడు కాబూయీ విచారంగా.

"సముద్ర తీరంలో బండల మధ్య వున్న ఇరుకైన మార్గం గుండా అంత పెద్ద రాకాసి మృగం రాజాలదు. ఒకవేళ వచ్చిందే అనుకున్నా అది అడుగు మోపిన ప్రతిచోటూ సర్వనాశనం అయి వుండేది. కాబట్టి అది రాకాసిమృగం పని కానే కాదు," అన్నాడు ఉత్తుండుగు దృఢంగా.

"మరి ఎవరి పనై ఉంటుందంటావు?" అని అడిగాడు కాబూయీ.

ఉత్తుంగుడు కొంతసేపు మౌనంగా ఆలోచించి, "దళనాయకుడు నాగసింహుడు నిన్ననే రాజధానికి వచ్చాడు. రాజూ, సేనాధిపతీ నాగసింహుణ్ణి నాకు రక్షణగా పంపడానికి



నిశ్చయించారు. మాటల సందర్భంలో నేనే అతనికి శతాబ్దిక పుష్పాలు మీదగ్గర ఉన్నాయని చెప్పాను. పైగా, నాగసింహుడు నాగపురి సింహాసనం కోసం కుట్రపన్నడానికి ఆలోచిస్తున్నట్టు యువరాణి నాకు తెలియజేసింది. అతనిద్వారా రాజుగారికి కూడా ఆపద వాటిల్లే అపాయం ఉన్నది. కాబట్టి నాగసింహుడే మీ ఇంట్లో శతాబ్దిక పుష్పాలను అపహరించి ఉంటాడని నాకు అనిపిస్తున్నది!" అని యువరాణి తనకు చెప్పిన విషయాలన్నిటినీ కాబూయీకి చెప్పాడు.

"నాగసింహుడికి రాజుగారి పట్ల అసూయా ద్వేషాలు ఉన్నాయనీ, అతడు నాగపురి సింహాసనం కోసం కలలు కంటున్నాడనీ నేను ఇంతకు ముందే విన్నాను. అటువంటి దుర్మార్గుణ్ణి నీకు రక్షణగా పంపాలనుకోవడం దురదృష్టకరం. అతని పట్ల నువ్వు చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి సుమా. దళనాయకుడు నీకోసం కబురు చేస్తానన్నాడు గనక నువ్వు ఇక్కడే వుండు. నేను మాత్రం వెళ్ళి రాజుగారికి పువ్వులు కనిపించని సంగతి చెబుతాను," అంటూ కాబూయీ అక్కడి నుంచి రాజు దగ్గరికి వెళ్ళాడు.

కాబూయీ మాటలు విని రాజు, "మీ ఇంట దాచిన శతాబ్దికపుష్పాలు కూడా కనిపించడం లేదా! రాకాసిమృగానికే కాదు, వేరెవరికో కూడా ఆ పువ్వుల అవసరం ఏర్పడిందన్నమాట!" అని కొంతసేపు ఆలోచించి, సేనాధిపతి కోసం కబురంపాడు.

సేనాధిపతి రాగానే, "దుర్జయా! కాబూయీ ఇంటిలోని పుష్పాలు కూడా మాయమయ్యాయట! ఏదో కుట్ర ప్రారంభమయినట్టున్నది!" అన్నాడు రాజు ఆవేశంగా.

"అంతా చిత్రంగా ఉన్నది, ప్రభూ! కుట్రదారులెవరైనాసరే, త్వరలోనే బయటపెడతాను ప్రభూ!" అన్నాడు సేనాధిపతి.

కాబూయీ, ఉత్తుంగుడు తనకు చెప్పిన విషయాలను సేనాధిపతికి చెప్పాడు.

"అదా సంగతి! అంటే శతాబ్దిక పుష్పాలు మీ ఇంట ఉన్న విషయం నాగసింహుడికి తెలుసునన్న మాట!" అన్నాడు సేనాధిపతి తల పంకిస్తూ. — (ఇంకావుంది)



# విచిత్ర పుష్పం

11

[దళనాయకుడు నాగసింహుడి నాయకత్వంలో కొందరు సైనికులను ఉత్తుంగుడికి సముద్ర ప్రయాణంలో తోడుగా పంపడానికి నాగపురి రాజు నిర్ణయించాడు. సేనాధిపతి, ఉత్తుంగుడికి ఆరోజే రాజ్యం సరిహద్దు నుంచి వచ్చిన నాగసింహుణ్ణి పరిచయం చేశాడు. గూడెంలో తమ ఇంట దాచిన శతాబ్దిక పుష్పాలు కూడా కనిపించలేదని కాబూయి విచారంతో రాజధానికి వచ్చాడు. కాబూయి, సేనాధిపతి రాజు దగ్గరికి వెళ్ళి సంగతి చెప్పారు. –తరవాత]

"శతాబ్దిక పుష్పాలు మీ ఇంట్లో వున్న సంగతి ఉత్తుంగుడు నాగసింహుడికి చెప్పాడు. అంటే వాటిని నాగసింహుడే అపహరించి ఉంటాడంటావా?" అని అడిగాడు సేనాధిపతి.

కాబూయి కొంతసేపు మౌనంగా ఆలోచించి, "నాగసింహుడు ఒకవేళ కుట్ర చేయాలనుకున్నప్పటికీ, ఈ పుష్పాలు అతనికెలా ఉపయోగపడతాయో అర్థం కావటం లేదు, ప్రభూ!" అన్నాడు.

"నువ్వన్నది నిజమే. శతాబ్దిక పుష్పాలు లేకుండా ఉత్తుంగుడు బయలుదేరలేడు గనక, అవి దొరికేంతవరకు నువ్వు రాజధానిలోనే ఉండడం మంచిది," అన్నాడు సేనాధిపతి.

"అలాగే వుంటాను," అని చెప్పి కాబూయి అక్కడినుంచి ఉత్తుంగుడి విడిదికి వెళ్ళాడు. వాళ్ళిద్దరూ ఆ పువ్వుల గురించి చాలాసేపు చర్చించి, బాగా రాత్రయ్యాక నిద్రకు ఉపక్రమించారు.







మరునాడు మధ్యాన్నం ఒక సైనికుడు వచ్చి, "కాబూయీ, నిన్ను చూడాలని ఇద్దరు యువతులు వచ్చారు," అన్నాడు.

కాబూయీ గది వెలుపలికి వచ్చి, అక్కడున్న ఇద్దరు యువతులలో ఒకామెను చూసి, "అమ్మా, చిత్రా నువ్వా! ఇప్పుడెందుకు వచ్చావు? అమ్మ క్షేమంగా ఉన్నది కదా?" అని అడిగాడు ఆతృతగా.

"అమ్మ క్షేమంగానే ఉన్నది నాన్నా!" అంటూ ఆమె తండ్రిని సమీపించి, "కనిపించకుండా పోయిన పువ్వులు దొరికాయి నాన్నా!" అన్నది మెల్లగా.

"శతాబ్దిక పుష్పాలు దొరికాయా? నిజంగానా!" అన్నాడు కాబూయీ నమ్మలేనట్టుగా.

"అవును నాన్నా, నిజం! మేము ఈరోజు ఉదయం ఎప్పటిలాగే సముద్ర తీరానికి వెళ్ళాము. అక్కడ ఉత్తుంగుడు వచ్చిన పడవ బోర్లించబడి కనిపించింది. దగ్గరికి వెళ్ళి చూస్తే లోపల శతాబ్దిక పుష్పాలు కట్టలు కట్టలుగా కనిపించాయి. పడవను సముద్ర జలాల కేసి లాగినట్టు ఇసుక మీద రెండు చారలు కూడా కనిపించాయి. బహుశా ఉత్తుంగుడే వెళ్ళడానికి ప్రయత్నించాడేమో అని మేము అనుకున్నాము," అన్నది చిత్ర. అప్పుడే అక్కడికి ఉత్తుంగుడు కూడా వచ్చాడు.

"లేదు చిత్రా! అతడు రాత్రి ఇక్కడే ఉన్నాడు. అది సరే, ఇప్పుడు ఆ పువ్వులు ఎక్కడున్నాయి?" అని అడిగాడు కాబూయీ.

"అక్కడే, సముద్ర తీరం దగ్గరి పడవలోనే ఉన్నాయి. ఈ సంతోషకరమైన సంగతి మీకు తెలియజేయడానికే నా స్నేహితురాలిని వెంటబెట్టుకుని వచ్చాను," అన్నది చిత్ర.

కాబూయీ ఆప్యాయంగా కూతురి భుజం మీద చేయివేసి, "చాలా సంతోషం, చిత్రా! మీరు ఇక్కడే ఉండండి, మేము వెళ్ళి సేనాధిపతికి ఈ సంగతి చెప్పి వస్తాము," అని ఉత్తుంగుడి కేసి తిరిగి, "రా, వెళదాం," అంటూ ముందుకు నడిచాడు.

ఉత్తుంగుడు, "శతాబ్దిక పుష్పాలు కనిపించాయా? మీకుమార్తె ఏమంటున్నది, కాబూయీ?" అని అడిగాడు అతని వెంట నడుస్తూ.







కాబూయీా, తన కుమార్తె చెప్పిన విషయా లన్నిటినీ ఉత్తుంగుడికి చెప్పాడు. శతాబ్దిక పుష్పాలు దొరికాయని తెలియగానే ఉత్తుం గుడు చాలా సంతోషించాడు. అయినా, ఆ పువ్వులను తీసుకుని తన పడవలో వెళ్ళా లని ప్రయత్నించినవాడెవడై ఉంటాడు? నాగ సింహుడే అయితే, అతని ఉద్దేశం ఏమై వుంటుంది? ఇలా రకరకాలుగా ఆలోచిస్తూ, ఉత్తుంగుడూ, కాబూయీా సేనాధిపతి భవనం సమీపించారు. వాళ్ళను చూడగానే సేనాధిపతి, "ఏమయింది?" అని అడిగాడు. కాబూయీా సంగతి చెప్పాడు.

"శభాష్! ఆ శుభవార్తను తెచ్చిన సైనికులు ఎక్కడ?" అన్నాడు సేనాధిపతి.

"సైనికులు కాదు ప్రభూ. ఆ వార్తను నా కుమార్తె చిత్ర తీసుకువచ్చింది," అంటూ కాబూయీా అన్ని విషయాలూ వివరించాడు.

"అలాగా! చాలా సంతోషం. ఆ పుష్పాలకు రక్షణ ఏర్పాటు చేయాలి. ఇప్పుడే మన సైనికులను కొందరిని పంపుతాను. మొదట ఈ సంగతి రాజుకు తెలియజేద్దాం, పద," అంటూ అక్కడినుంచి బయలుదేరాడు.

వాళ్ళ నుంచి విషయం తెలుసుకున్న రాజు, "చాలా సంతోషం, సేనాధిపతీ! ఆ పుష్పాలను రాకాసిమృగం దగ్గిరికి చేర్చడానికి ఏమాత్రం ఆలస్యం చేయకూడదు, ఏమం టావు కాబూయీా?" అని ఉత్తుంగుడి వైపు తిరిగి, "ఎప్పుడు బయలుదేరతావు?" అని అడిగాడు.

"ఈ క్షణమే బయలుదేరమన్నా సిద్ధంగా ఉన్నాను, ప్రభూ!" అన్నాడు ఉత్తుంగుడు.

"శభాష్, ఉత్తుంగా!" అంటూ రాజు లేచి నిలబడి, ఉత్తుంగుడి భుజం మీద చేతులు వేసి, "నీవంటి సాహసవీరులే ఏ రాజ్యానికైనా నిజమైన సంపద వంటివారు! తిరుగు ప్రయా ణంలో మా రాజ్యానికి తప్పకుండా వచ్చి వెళ్ళు!" అని చెప్పి, సేనాధిపతికేసి తిరిగి, "ఈరోజే ఉత్తుంగుడి ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లన్నిటినీ చూడు. నేను వెళ్ళి శతాబ్దిక పుష్పాలు దొరికిన సంగతి మల్లికకు చెబు తాను," అంటూ భవనం లోపలికి బయలు దేరాడు.



రాజభవనం నుంచి వెలుపలికి వచ్చిన సేనాధిపతి, నాగసింహుడి కోసం కబురు పంపాడు.

కొంతసేపటికి అక్కడికి వచ్చిన దళ నాయకుడు నాగసింహుడు — సేనాధిపతీ, కాబూయీ, ఉత్తుంగుడూ ఒకేచోట ఉండడం చూసిఒక్క క్షణం ఉలిక్కిపడ్డాడు. ఆ తరవాత తేరుకుని సేనాధిపతికి నమస్కరించాడు.

"ఈరోజే ఉత్తుంగుడి ప్రయాణం. నువ్వు మన సైనికులు కొందరితో అతనికి రక్షణగా వెళ్ళాలి. ఇది రాజాజ్ఞ!" అన్నాడు సేనాధిపతి.

"ఈ రోజేనా, సేనాధిపతీ! మరి పుష్పాలు లభించాయా?" అని అడిగాడు నాగసింహుడు అమితాశ్చర్యంతో.

"పుష్పాలా? ఆ సంగతి నీకెందుకు?" అని అడిగాడు సేనాధిపతి కటువుగా.

"మేము పుష్పాలు తీసుకువెళ్ళాలి కదా!" అని అడిగాడు నాగసింహుడు.

"అవును. వాటిని రాకాసిమృగం ఉన్న చోటికి చేర్చడానికే ఈ ప్రయాణం. ఈరోజు సాయంకాలానికి మీరు సముద్రతీరం చేరండి. బండల మధ్య దారిగుండా సముద్రంలో పడవలో బయలుదేరండి. మీకు వెనకగా రెండు పడవలలో మన సైనికులు వస్తారు. మిగతా విషయాలు ఉత్తుంగుడు చూసుకుంటాడు," అన్నాడు సేనాధిపతి.

"మరి, పుష్పాలు?" అంటూ ఏదో చెప్పబోయి ఆగాడు నాగసింహుడు.



"అన్నీ సిద్ధంగా ఉన్నాయని చెప్పాను కదా? నువ్వు బయలుదేరడమే తరువాయి," అన్నాడు సేనాధిపతి.

"చిత్తం, సేనాధిపతీ!" అని నాగసింహుడు అక్కడినుంచి విసురుగా వెళ్ళిపోయాడు.

ఆ తరవాత సేనాధిపతి, ఉత్తుంగుడితో, "పుష్పాలు దొంగిలించబడిన సంగతి నాగసింహుడికి తెలిసే వుంటుంది. అయినా, ఇప్పుడు విచారణకు సమయం కాదు. అతడు ఒంటరిగా రాకాసిమృగాన్ని ఎదుర్కోలేడు కనక, నీకు హాని తలపెట్టే అవకాశం లేదు. ఎందుకయినా నువ్వు నాగసింహుడి పట్ల జాగ్రత్తగా ఉండడం అవసరం!" అని చెప్పాడు.



"అలాగే!" అన్నాడు ఉత్తుంగుడు విన యంగా.

సేనాధిపతి, కాబూయితో, "నువ్వు ఉత్తుం గుడి వెంట సముద్ర తీరం వరకు వెళ్ళి, అతన్ని సాగనంపి రా," అన్నాడు.

"చిత్తం, సేనాధిపతీ!" అని కాబూయి ఉత్తుంగుణ్ణి వెంటబెట్టుకుని అక్కడినుంచి వాళ్ళు ఉంటున్న విడిదికి వెళ్ళాడు. వాళ్ళ కోసం ఎదురుచూస్తున్న చిత్రతో అన్ని సంగ తులూ చెప్పాడు కాబూయి.

కొంతసేపటికి దళనాయకుడు నాగసిం హుడు అక్కడికి వచ్చాడు. అందరూ సముద్ర తీరానికి బయలుదేరారు. నాగసింహుడు ఒక్క మాట కూడా మాట్లాడలేదు. అతని ముఖంలో తీరని విచారం, నిరుత్సాహం కనిపించాయి.

సైనికులు వాళ్ళను చూడగానే చేతులెత్తి దళనాయకుడికి నమస్కరిస్తూ ఆహ్వానిం చారు. అక్కడ మూడు పడవలు సిద్ధంగా ఉన్నాయి. ఒక పడవలో శతాబ్దిక పుష్పాలు ఉన్నాయి. అవి అప్పుడే పూచినట్లు కళ కళ లాడుతూ కమ్మని వాసనలు వెదజల్లుతు న్నాయి. పువ్వులున్న పడవ తాను వచ్చినదే అని ఉత్తుంగుడు గ్రహించాడు. అతడు తన నడుముకు కట్టుకున్న సంచీలో దాచిన శతాబ్దిక మొక్కలను తీసి, చిత్రకు ఇచ్చి, వాటిని వాళ్ళ ఇంటి దగ్గర నాటి పెంచమని చేతి సైగలతో తెలియజేశాడు.

మొక్కలను తీసుకున్న చిత్ర, ఉత్తుంగుడి కేసి విచారంగా చూడసాగింది.

శతాబ్దికపుష్పాలను చూడగానే, నాగసిం హుడిలో ఎక్కడలేని ఉత్సాహం పుట్టుకు వచ్చింది. ఉత్తుంగుడు ఎందుకు ఆలస్యం చేస్తున్నాడన్న భావంతో అతనికేసి చూడ సాగాడు. దానిని గ్రహించిన కాబూయి, "ఉత్తుంగా, చీకటి పడకముందే బయలు దేరడం మంచిది. నేను చెప్పిన విషయం గుర్తుంచుకో. నీ రాక కోసం మేము ఎదురు చూస్తుంటాము," అంటూ చేయెత్తి వీడ్కోలు చెప్పాడు.

ఉత్తుంగుడు అతనికి నమస్కరించి, పడవ కేసి నడిచాడు. ఆలోగానే నాగసింహుడు పడ





వలో కూర్చుని ఉన్నాడు. సైనికులు పడవను నీళ్ళలోకి తోశారు. ఉత్తుంగుడు అందులోకి ఎక్కి కూర్చుని తెడ్లను అందుకున్నాడు. ఆ పడవ వెనక సైనికులతో రెండు పడవలు బయలుదేరాయి.

ఉవ్వెత్తున లేచిన ఒక అల మూడు పడవలనూ లోతైన సముద్ర జలంలోకి తీసుకువెళ్ళింది. అప్పుడే సూర్యాస్తమయం అవుతున్నది. అర్ధరాత్రి కల్లా సముద్ర మధ్యాన్ని చేరుకోవాలన్న ఉత్సాహంతో ఉత్తుంగుడు పడవను నడపసాగాడు. వెనక రెండు పడవలలో సైనికులు కొద్ది దూరంలో అతన్ని అనుసరించి రాసాగారు.

"ఈ పువ్వులను తీసుకుపోయి, రాకాసి మృగం ఉన్నచోట చేర్చినంత మాత్రాన అది మాణిక్యపురికి రాదని నీకెలా తెలుసు?" అన్న మాటలు కఠినస్వరంతో వినిపించడంతో ఉత్తుంగుడు తల పైకెత్తి చూశాడు.

నాగసింహుడు కోపంగా చూస్తున్నాడు.

"ఈ పువ్వుల చేత ఆకర్షించబడే రాకాసి మృగం మాణిక్యపురికి వచ్చింది. ఇప్పుడు మాణిక్యపురిలో ఒక్క శతాబ్దిక పుష్పం కూడా లేకుండా చేశాం. అన్నిటినీ కట్టగట్టుకుని తీసుకుని వచ్చాను. మరొక వంద సంవత్సరాలు ఆ పువ్వులు పూచే అవకాశం లేదు. కాబట్టి రాకాసిమృగం అంతవరకు మాణిక్యపురికి వచ్చే అపాయం లేదనే పెద్దలు చెప్పారు!" అన్నాడు ఉత్తుంగుడు.



"అంటే, ఈ పువ్వులను చూపి రాకాసి మృగంతో బేరం కుదుర్చుకోవచ్చునన్న మాట! అంతేనా?" అన్నాడు నాగసింహుడు.

"రాకాసిమృగంతో బేరమా! ఏమిటి నువ్వంటున్నది? దానిని సమీపించి మాట్లాడడం ఎలా సాధ్యం? దానికి మన భాష అర్థమవుతుందా? ఇంతకూ నీకు రాకాసిమృగంతో ఏమిటి పని?" అని అడిగాడు ఉత్తుంగుడు ఆశ్చర్యంగా.

"చాలా ముఖ్యమైన పనే ఉన్నది! రాజభవనాన్నీ, అందులోని రాజునూ, రాణినీ, యువరాణినీ నేలమట్టం చెయ్యాలి. అందుకు నాకు రాకాసి మృగం సహాయం కావాలి!" అన్నాడు నాగసింహుడు.

ఉత్తుంగుడికి మరొక భయంకర మృగంతో మాట్లాడుతున్నట్టనిపించింది. అసలు రాకాసి మృగం పువ్వుల కోసం బీభత్సం సృష్టిస్తే, నాగసింహుడు స్వార్థంతో అంతకన్నా క్రూర రాక్షసుడుగా మాట్లాడుతున్నాడు!

"మంచివాళ్ళూ, నీకు బంధువులూ అయిన వాళ్ళను ఎందుకు నాశనం చేయాలి?" అని అడిగాడు ఉత్తుంగుడు.

"నేను నాగపురికి రాజును కావాలి. దానికి అడ్డుపడేవాళ్ళు ఎవరయినా సరే హతమారుస్తాను. నా తోబుట్టువులు, బంధువులు, ఆప్తులు అనే దయాదాక్షిణ్యాలు పాటించను. ఆఖరికి నువ్వు అడ్డుపడినా సరే హతమార్చి తీరుతాను," అన్నాడు నాగసింహుడు పిడికిలి బిగిస్తూ.

"నన్ను హతమారుస్తావా? మాణిక్యపురి నుంచి తెచ్చిన పువ్వులు నీకు ఉపయోగపడడానికి అనుమతించను. వాటి ద్వారా రాజ కుటుంబానికి హాని జరగడానికి ఒప్పుకోను!" అన్నాడు ఉత్తుంగుడు దృఢమైన కంఠస్వరంతో.

"నువ్వు ప్రాణాలతో ఉంటే కదా ఒప్పుకోక పోవడానికి?" అంటూ నాగసింహుడు లేచి, ఉత్తుంగుణ్ణి తెడ్డుతో ఒక్క తోపు తోశాడు. ఉత్తుంగుడు వెల్లకిలా సముద్రంలోకి పడిపోయాడు. తరవాత అతని జాడ తెలియ లేదు. నాగసింహుడు కొంతసేపు చుట్టుపక్కల కలయ చూసి, తన పడవను సైనికులు వస్తూన్న పడవలకేసి నడిపించి, తన పడవలోని శతాబ్దిక పుష్పాలను ఆ పడవలలోకి మార్చుకుని తనూ అందులోకి వెళ్ళాడు.

సముద్రంలో పడిన ఉత్తుంగుడు నెమ్మదిగా ఈదుతూ వుండి, కొంతసేపటికి తల ఎత్తి చూశాడు. చీకటి అలముకుంటున్నది. ఉన్నట్టుండి అతని చేతికేదో తగిలింది. అతడు దానిని పరిశీలించి చూశాడు. అదొక ఖాళీ పడవ. అతడు అతి ప్రయత్నం మీద ఆ పడవలోకి ఎక్కి కూర్చున్నాడు. అదృష్టవశాత్తు అందులో రెండు తెడ్లు ఉన్నాయి. ఒకవైపున అతనికి దూరంగా ఎత్తయిన బండలు కనిపించాయి. శతాబ్దిక పుష్పాలు లేకుండా రాకాసి మృగాన్ని ఎదుర్కోవడం వల్ల ప్రయోజనం లేదు కాబట్టి, పడవను బండలు కనిపిస్తున్న తీరంకేసి నడపసాగాడు. — (ఇంకావుంది)





# విచిత్ర పుష్పం

12

[నాగపురి రాజభవనం నుంచి కనిపించకుండా పోయిన శతాబ్దిక పుష్పాలు సముద్ర తీరంలో ఒక పడవలో కనిపించాయి. దళనాయకుడు నాగసింహుడూ, మరికొందరు భటులూ తోడుగా ఉత్తుంగుడు శతాబ్దిక పుష్పాలతో రాకాసిమృగాన్ని వెతుక్కుంటూ బయలుదేరాడు. కొంతదూరం పోయాక, నాగసింహుడు ఉత్తుంగుణ్ణి సముద్రంలోకి తోసి, శతాబ్దిక పుష్పాలను చేజిక్కించుకున్నాడు. ఉత్తుంగుడు తీరంకేసి పడవలో బయలుదేరాడు. — తరవాత]

ఉత్తుంగుడు మాణిక్యపురి నుంచి వెళ్ళి ఒక వారం గడిచిపోయినప్పటికీ అతని జాడ తెలియకపోవడంతో రాజభవనంలోని ఉత్తుంగుడి చెల్లెలు రజని, యువరాణి ప్రియంవద అతనికేమయిందోనని విచారించసాగారు. రాకాసిమృగం తాకిడికి భయపడి ఇల్లూ, వాకిలీ వదిలిపెట్టి, శరణార్థులుగా వచ్చిన స్త్రీలకూ, పిల్లలకూ భోజనం, వసతి సౌకర్యాలు ఏర్పాటుచేసి యువరాణి ప్రియంవద స్వయంగా పర్యవేక్షిస్తున్నది. ఆమెతో పాటు వున్న రజనికి వారం రోజులు ఏమాత్రం కష్టం లేకుండా గడిచిపోయాయి. అయితే, అన్న ఇంకా తిరిగి రాలేదన్న బాధ ఆమె మనసులో కలవరం పుట్టించసాగింది. చిన్నప్పటి నుంచి తనను ఎన్నడూ వదిలి వెళ్ళని అన్న వరసగా వారం రోజులు కనిపించక పోయేసరికి ఆమె విచారం రోజురోజుకూ ఎక్కువ కాసాగింది.







తీసుకుపోయి వదిలి రావడానికే కదా వెళ్ళాడు. అతను తప్పకుండా విజయవంతంగా తిరిగి రాగలడు. నువ్వు నిశ్చింతగా నిద్రపో," అని ఓదార్చింది యువరాణి.



ఉత్తుంగుడు పడవను తీరంకేసి నడిపిస్తూ, తనను నీళ్ళలోకి తోసిన నాగసింహుడి పడవా, తోడుగా వచ్చిన సైనికుల పడవలూ కనిపిస్తాయేమోనని చుట్టుపక్కల పరిశీలించి చూశాడు. కనుచూపు మేరలో ఏదీ కనిపించ లేదు. కొంతసేపటికి అతడు సముద్ర తీరం లోని ఎత్తయిన బండల దగ్గరికి చేరాడు. అలల ఉధృతం ఎక్కువయింది. హఠాత్తుగా లేచిన ఒక అలతో పాటు పడవ తల్లకిందులై ఎగిరి తీరం మీద పడింది. ఉత్తుంగుడు పడవ నుంచి ఎగిరి దూరంగా పడ్డాడు. అదృష్ట వశాత్తు అతనికి గాయం తగలలేదు. ఈ పరి ణామాన్ని అతడు ఊహించిందే కాబట్టి, చప్పున లేచి పడవను మరికొంత దూరం ఇవతలికి లాగి వదిలిపెట్టి గూడెం కేసి పరిగెత్తాడు.

గూడెం సమీపించి కాబూయీ ఇంటి తలుపు తట్టాడు. కొంతసేపటికి వచ్చి తలుపు తీసిన కాబూయీ కూతురు చిత్ర, "నువ్వా! ఏం జరిగింది?" అని అడిగింది చాలా ఆశ్చర్యంగా.

ఆమె అడుగుతున్నదేమిటో ఊహించిన ఉత్తుంగుడు సమాధానం చెప్పలేక, "కాబూయీ, ఎక్కడ?" అని అన్నాడు చేయెత్తి సైగచేస్తూ.

ఆరోజు రాత్రి పడుకునేప్పుడు అన్నను గురించి ఆలోచిస్తూ నిద్రపోయిన రజని కొంతసేపటికి 'అన్నయ్యా' అని కేకపెట్టి లేచి కూర్చున్నది.

ఆ కేక విని పక్క గదిలోని యువరాణి లేచి వచ్చి, "మీ అన్నయ్య వచ్చాడా?" అని అడిగింది.

"లేదు, యువరాణీ! కల వచ్చింది. మా అన్నయ్యనెవరో పడవలో నుంచి సముద్రం లోకి తోసేశారు!" అన్నది రజని కన్నీళ్ళతో.

"కలే కదా! విచారపడకు. వీరుడైన మీ అన్ననెవరూ నీళ్ళలోకి పడదోయలేరు. పైగా అతడు రాకాసిమృగం మీదికి యుద్ధానికి వెళ్ళలేదు కదా? దానిని దూరప్రాంతానికి





"బా.... సేనాధిపతి ఇంటికి వెళ్ళాడు," అన్నది చిత్ర.

"రాజుగారి దగ్గరికా?" అని అడిగాడు ఉత్తుంగుడు.

చిత్ర కాదు అన్నట్టు తల అడ్డంగా ఊపి, "సేనాధిపతి దుర్జయుడి దగ్గరికి!" అన్నది రాజధానికేసి చేయి చూపుతూ.

ఉత్తుంగుడు అక్కడినుంచి ఉరుకులతో, పరుగులతో రాజధానిని చేరి సేనాధిపతి ఇంటిని సమీపించాడు.

లోపల కూర్చుని సేనాధిపతీ, కాబూయీ ఏదో మాట్లాడుకుంటున్నారు. ఉత్తుంగుణ్ణి చూడగానే వాళ్ళిద్దరూ ఆదుర్దాగా లేచి నిలబడి, "ఉత్తుంగా! ఏమయింది? దళనాయకుడెక్కడ?" అని అడిగారు ఒక్కసారిగా.

"నేను సముద్రంలోకి పడిపోయాను. దళనాయకుడికేమయిందో తెలియదు," అన్నాడు ఉత్తుంగుడు.

"రాకాసిమృగం దాడి చేసిందా?" అని అడిగాడు కాబూయీ.

"లేదు. నాగసింహుడే దాడి చేశాడు," అంటూ ఉత్తుంగుడు తాను బయలుదేరిన తరవాత జరిగిన దానిని క్లుప్తంగా వివరించాడు.

అంతా విన్న కాబూయీ, "అదృష్టవశాత్తు నీ ప్రాణానికేమీ కాలేదు, అంతే చాలు!" అంటూ ఉత్తుంగుడి చేతిని ఆప్యాయంగా పట్టుకుని, "రాకాసిమృగాన్ని ఆకర్షించే శతాబ్దిక



పుష్పాలను పట్టుకుపోయి, నాగసింహుడు ఏం చేయగలడో అంతుబట్టడం లేదు," అన్నాడు.

ఆ మాటకు సేనాధిపతి దుర్జయుడు, "నాగసింహుడి దురాశ మనం ఎరిగినదే. వాడు ఉత్తుంగుడితో చెప్పినవిధంగా దేనికైనా తెగించగలడు. వాడి దుష్టపథకాన్ని నెరవేర్చడానికి, శతాబ్దిక పుష్పాలను ఆశచూపి, రాకాసిమృగాన్ని నాగపురి మీదికి నడిపించాడంటే మనకూ, మాణిక్యపురికి పట్టిన గతే పట్టడం తథ్యం," అన్నాడు.

"అయితే, ఒక విషయం గమనించాలి. నాగసింహుడు రాకాసిమృగాన్ని చూడలేదు. అది పెద్ద కొండలాగా వుంటుంది. అది



సముద్రంలో ఎత్తయిన కొండల మధ్య వున్న ఒకే ఒక ఇరుకు మార్గం గుండా నాగపురిలోకి ప్రవేశించజాలదు!" అన్నాడు ఉత్తుంగుడు.

"అలాఅయితే ఫరవాలేదు. ఈ విషయాన్ని రాజుగారికి తెలియజేద్దాం. రాజకుటుంబ రక్షణ చాలా ముఖ్యం!" అంటూ సేనాధిపతి అక్కడినుంచి బయలుదేరాడు.

కాబూయీ, ఉత్తుంగుడూ ఆయనను అనుసరించారు.

రాజు వాళ్ళను చూడగానే, "ఉత్తుంగా! నువ్వు ఇంకా బయలుదేరలేదా," అని అడిగి, సేనాధిపతికేసి తిరిగి, "నాగసింహుడు పారిపోయాడా ఏం?" అన్నాడు అనుమానంగా.

"లేదు, మహారాజా! మనం ఎదురుచూడని సంఘటనలు కొన్ని జరిగిపోయాయి," అంటూ సేనాధిపతి ఉత్తుంగుడు చెప్పిన విషయాలన్నీ రాజుకు వివరించాడు.

అంతా విన్న రాజు, "దుర్జయా! మా క్షేమాన్ని వదిలిపెట్టు. మన రాజ్యానికీ, ప్రజలకూ ఎటువంటి ఆపదా వాటిల్లకూడదు. మనం ఇప్పుడే సముద్రతీరానికి వెళదాం. ఒక్క క్షణం కూడా జాప్యం చేయకూడదు. మన భటులను కాగడాలను పట్టుకుని బయలుదేరమని ఆజ్ఞాపించు. రాకాసిమృగానికి వెలుగంటే భయమని ఉత్తుంగుడు చెప్పాడు. కాబట్టి మన చేతులలో కాగడాలు ఉన్నంతవరకు రాకాసిమృగం మనల్ని సమీపించజాలదు. కాబూయీ! నువ్వూ, ఉత్తుంగుడూ ఇప్పుడే సముద్రతీరానికి బయలుదేరండి. నేనూ, సేనాధిపతీ భటులతో మీవెనకే వస్తాము. సముద్రతీరం చేరాక ఏం చేయాలో నిర్ణయిద్దాం," అని ఆజ్ఞాపించాడు.

"చిత్తం, మహారాజా!" అంటూ ముగ్గురూ అక్కడినుంచి బయలుదేరారు.

కాబూయీ, ఉత్తుంగుడూ గూడెం చేరేసరికి, అక్కడి స్త్రీ పురుషులందరూ వాళ్ళ కోసం ఎదురుచూస్తున్నారు. కాబూయీ ఇంటి లోపలికి వెళ్ళి, భార్యతో ఏదో చెప్పి, తిరిగి వచ్చాడు. ఉత్తుంగుడూ, కాబూయీ కలిసి సముద్రతీరంకేసి వేగంగా వెళ్ళడం గూడెంలోని స్త్రీలు ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డారు.

ఇద్దరూ సముద్రతీరం చేరారు. ఎత్తయిన బండలను తాకే అలలశబ్దం తప్ప వాతావరణం ప్రశాంతంగానే వున్నది. వాళ్ళు అక్కడి ఎత్తయిన బండల మీదికి ఎక్కి పడవలేమైనా వస్తున్నాయేమోనని పరిశీలించి చూశారు. ఎటు చూసినా చీకటి. ఏదీ కనిపించలేదు. కొంత సేపటికి సముద్రంలో దూరం నుంచి ఏవో మాటలు అస్పష్టంగా వినిపించసాగాయి. ఆ మాటలు క్రమక్రమంగా మరింత గట్టిగా వినిపించాయి.

"అది నాగసింహుడి కంఠస్వరం కదా?" అని అడిగాడు కాబూయీ.

ఉత్తుంగుడు మాట్లాడలేదు. తదేకంగా సముద్రం కేసి చూస్తున్నాడు. చాలాసేపు అలా చూశాక, "కాబూయీ! అదిగో చూడు రాకాసిమృగం!" అన్నాడు.

"ఎక్కడ? నాకేదీ కనిపించడం లేదే!" అన్నాడు కాబూయీ.

ఉత్తుంగుడు చేయెత్తి చూపుతూ, "అదిగో, నా వేలికి సూటిగా చూడు. రాకాసిమృగం కొండలాగా నెమ్మదిగా కదిలి వస్తున్నది!" అన్నాడు.

"అగు, నిజమే. ఏదో కొండ కనిపిస్తున్నది. అదెలాకదులుతుంది?" అన్నాడు కాబూయీ.

"ఇంతకు ముందెప్పుడయినా అక్కడ కొండను చూశావా? మరి హఠాత్తుగా ఇప్పు డెలా మొలిచింది?" అని అడిగాడు ఉత్తుంగుడు.



"అవును, అది కొండ కాదు. కొండలాంటి ప్రాణి ఏదో వస్తున్నది. నిజమే!" అన్నాడు కాబూయీ దానికేసి తదేకంగా చూస్తూ.

"అదే రాకాసిమృగం. అది పడవల వెంట వస్తున్నది. దానికి ముందు చూడు, రెండు పడవలు వస్తున్నాయి. అంత పెద్ద మృగం ఇక్కడి ఇరుకు మార్గం గుండా లోపలికి రాజాలదు కదా?" అని అడిగాడు ఉత్తుంగుడు.

"అవును. నిజమే. ఏం జరుగుతుందో చూద్దాం. ఈలోగా రాజుగారు వస్తే మరీ మంచిది," అన్నాడు కాబూయీ.

"అదిగో వస్తున్నారు, చూడు," అన్నాడు ఉత్తుంగుడు.



కాబూయీ వెనక్కు తిరిగి చూశాడు. సైనికులు కాగడాలను పట్టుకుని వస్తున్నారు. కాగడాల వెలుతురులో రాజూ, సేనాధిపతీ స్పష్టంగా కనిపిస్తున్నారు. కొంతసేపటికి వాళ్ళందరూ, ఉత్తుంగుడున్న పెద్ద బండ మీదికి వచ్చి చేరారు. కాగడాల వెలుతురు సముద్రంలో కొంత దూరం వ్యాపించింది. ఆ వెలుగులో రెండు పడవలు తీరంకేసి వేగంగా రావడం కనిపించింది. ఒక పడవలో నిలబడిన వ్యక్తి చేయెత్తి అదిలిస్తున్నాడు. పడవల వెనక నల్లటి పెద్ద ఆకారం కదిలి వస్తున్నది.

"అదిగో రాకాసిమృగం!" అన్నాడు సేనాధిపతి.

"అవును! నాకూ కనిపిస్తున్నది," అన్నాడు రాజు.

కొంతసేపటికి అది మరింత దగ్గరికి రావడంతో దాని రూపం స్పష్టంగా కనిపించసాగింది. అది చేతులెత్తి పడవలను పట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నది. దాని చేయి తగలడంతో పడవలు అటూ-ఇటూ ఊగ సాగాయి. పడవలో నిలబడి వున్నవాడు ఆ ఊపుకు పడవలోకి పడిపోయాడు.

"కాగడాలను రాకాసిమృగం మీదికి వదలండి!" అని ఆజ్ఞాపించాడు సేనాధిపతి.

సైనికులు కాగడాలను విల్లులకు సంధించి రాకాసిమృగం మీదికి బాణాల్లా వదలసాగారు. వాళ్ళకు పక్కనున్న సైనికులు కాగడాలను ముట్టించి అందిస్తున్నారు.

కాగడాలు కొన్ని సముద్రంలో పడ్డాయి. మరికొన్ని పడవలలో పడ్డాయి. కాగడాల వెలుతురును తట్టుకోలేని రాకాసిమృగం, ఒక చేతిని కళ్ళకు అడ్డుగాపెట్టుకుని రెండవ చేత్తో ఒకపడవను ఒడిసిపట్టుకున్నది. మండుతూన్న కాగడాలు రెండు దాని శరీరానికి తగలడంతో మంటలు లేచాయి. అది చప్పున నీళ్ళలోకి మునిగి మంటలు ఆరాక నీళ్ళపైకి మరింత భీకరంగా లేచి, పడవలను తల్లకిందులు చేసి నీళ్ళపై చెల్లాచెదురుగా తేలుతూన్న పూలను అందుకోసాగింది. ఆ పూల కట్టలతో పాటు కొందరు భటులు కూడా దాని గుప్పిటలో చిక్కి విలవిలా





తన్నుకోసాగారు. అది పూలను తీసుకుని భటులను దూరంగా విసిరివేసింది. భటులు హాహాకారాలు చేయసాగారు.

తీరం నుంచి సైనికులు వదులుతూన్న కాగడాలు శరీరానికి తగులుతున్నప్పటికీ అదిపూలను సేకరించడంలోనే లీనమయింది. పూలన్నిటినీ ఏరుకున్నాక అది మెల్లగా వెనుదిరిగింది. అయితే, కాగడాలు బాణాల్లా వరసగా దాని శరీరానికి తగలడంతో దాని తలతో సహా శరీరమంతా ఒక్కసారిగా భగ్గు మన్నది. అప్పుడు దాని తల అగ్నిగోళంలా కనిపించింది. అది పెద్దగా మూలుగుతూ నీళ్ళలోకి మునిగిపోయింది. ఆపైన దాని జాడ తెలియలేదు.

ఆ భయానకదృశ్యాన్ని అందరితో పాటు చూసిన రాజు, "రాకాసిమృగం మరణించి వుంటుంది. లేకుంటే ఈపాటికి అది పూల కోసం పైకి వచ్చి వుండేది. దాని పీడ విరగ డయినట్టే!" అన్నాడు పెద్దగా నిట్టూరుస్తూ.

ఆ తరవాత కొంతసేపటికి సముద్రంలో కొందరు భటులు తీరం కేసి ఈదుకుంటూ రావడం కనిపించింది. వాళ్ళను చూసిన సేనాధి పతి, "మీరన్నది నిజమే, మహారాజా! రాకాసి మృగం చచ్చింది. ఆ భటులు వచ్చాక మిగతా వివరాలు తెలియవచ్చు! కొందరు సైనికులను ఇక్కడ వుంచి మనం రాజధానికి తిరిగి వెళదాం," అన్నాడు సేనాధిపతి.

"నాగసింహుడు ఏమయ్యాడో తెలియ లేదే!" అన్నాడు కాబూయీ.

"ఆ సంగతి నేను చూస్తాను, మహారాజా! తమరు అనుమతించారంటే ఈ రాత్రికి నేను ఇక్కడే భటులతో పాటు వుండి వివ రాలు సేకరించుకుని తెల్లవారగానే రాజధానికి వస్తాను. తమ దయ వల్ల నేను వచ్చిన పని సగం పూర్తయింది. మాణిక్యపురికి ఎప్పుడు బయలుదేరాలో ఆ తరవాత నిర్ణయిద్దాం!" అన్నాడు ఉత్తుంగుడు వినయంగా.

"అలాగే!" అన్నాడు రాజు సంతోషంగా.

కొందరు సైనికులను ఉత్తుంగుడికి తోడుగా వుంచి రాజూ, సేనాధిపతీ, కాబూయీ మిగతా సైనికులతో సహా రాజభవనానికి బయలు దేరారు. — (ముగింపు వచ్చే సంచికలో)







# విచిత్రపుష్పం

## 13

[రాకాసిమృగం కోసం బయలుదేరిన ఉత్తుంగుణ్ణి, అతనికి తోడుగా వెళ్ళిన దళవాయకుడు నాగసింహుడు సముద్రంలోకి తోసేశాడు. ఉత్తుంగుడు నాగపురికి వచ్చి రాజుకు సంగతి చెప్పాడు. రాజూ, సేనాధిపతీ, సైనికులను వెంటబెట్టుకుని సముద్రతీరం చేరారు. సముద్రంలో రాకాసిమృగం పడవలను తరుముకుంటూ రావడం కనిపించింది. ఉత్తుంగుడి ఆజ్ఞానుసారం సైనికులు రాకాసిమృగం మీదికి కాగడాలను బాణాల్లాగా వదిలారు. రాకాసిమృగం భగ్గుమని మండి నీళ్ళలో మునిగిపోయింది. రాజు నాగపురికి తిరిగివెళ్ళాడు. — తరవాత]

ఉత్తుంగుడూ, ముగ్గురు భటులూ బండలపై నుంచి కిందికి దిగి, మరికొందరు సైనికులతో కలిసి సముద్రమార్గద్వారం దగ్గరకి చేరారు. కాగడాలు పట్టుకుని వాళ్ళు అక్కడ చాలాసేపు నిలబడ్డారు. కాని, సముద్రం నుంచి ఎవరూ రాలేదు.తూరుపు దిక్కున వేగుచుక్క పొడుస్తున్నప్పుడు, ఎవరో నీళ్ళనుంచి అతికష్టం మీద పైకిరావడంకనిపించింది. ఉత్తుంగుడు ఒక్క గెంతున వెళ్ళి, వాడికి చేయి అందించి, నీళ్ళ నుంచి పైకి లాగి, ఆసరాగా నడుంచుట్టూ చేయి వేసి, పట్టుకునివచ్చి ఒకచోట కూర్చోబెట్టాడు. ఆ భటుడు బాగా అలిసిపోయి స్పృహ కోల్పోయే స్థితిలో ఉన్నాడు. వాడి శరీరంలో వేడి పుట్టించడానికి పాదాలనూ, అరచేతులనూ రుద్దసాగాడు ఉత్తుంగుడు. కొంతసేపటికి భటుడు కళ్ళు తెరిచి, "రాకాసి మృగం వచ్చిందా?" అని అడిగాడు బెదురు బెదురుగా చూస్తూ.



సరిగ్గా ఆ సమయంలో మండుతూ ఉన్న కాగడాలు దాని శరీరాన్ని తాకడంతో నీళ్ళలోకి మునిగింది. కొంతసేపటికి అది మా పడవల కింది నుంచి లేచి, పడవలను తల్లకిందులు చేసి, పువ్వులను ఏరుకోసాగింది. కానీ, తీరం నుంచి వచ్చిన కాగడాలు దాని తలనూ, శరీరాన్నీ మళ్ళీ తాకడంతో భగ్గుమని మండుతూనీళ్ళలోకి మునిగిపోయింది. దిక్కుకొకరుగా పడిపోయిన మిగతా భటులేమయ్యారో తెలియదు. నేనిలా ఈదుకుంటూ తీరం చేరాను," అన్నాడు.

"దళనాయకుడు పడవలో నుంచి నన్ను తోసేశాడు. ఆతరవాత ఏం జరిగిందో నువ్వు రావడంవల్ల తెలిసింది!" అన్నాడు ఉత్తుంగుడు.

"నిన్ను నీళ్ళలోకి తోసేసి, దళనాయకుడు మా దగ్గరికి వచ్చి, రాకాసిమృగాన్ని తనకు అనుకూలంగా మార్చుకుని, తానే నాగపురికి రాజును కాగలనని మాతో చెప్పాడు. ఆ దురాశే అతని ప్రాణం తీసింది!" అన్నాడు భటుడు.

"సరే, మనం ఇప్పుడు సేనాధిపతి దగ్గరికి వెళ్ళి, జరిగిన సంగతి చెప్పాలి," అన్నాడు ఉత్తుంగుడు.

"అలాగే! నేనూ నీతో వస్తాను," అంటూ లేచి నిలబడ్డాడు భటుడు.

అప్పుడే సూర్యోదయమవుతున్నది. వాళ్ళకు సముద్ర జలాన్ని అనుకుని ఏదో మనిషి శవం కనిపించింది. వాళ్ళు దగ్గరికి వెళ్ళి చూశారు. ముఖం, ఒళ్ళూ కాలిపోయిన

ఉత్తుంగుడు తల అడ్డంగా ఊపడంతో, "అవును, ఇక్కడికెలా వస్తుంది? సముద్రం లోనే మండిపోయింది కదా? దళనాయకుడు కూడా చచ్చాడు. రాకాసిమృగాన్ని తీరానికి చేర్చకపోతే, మాకు చావు తప్పదని ఆ దుర్మార్గుడు బెదిరిస్తూ వచ్చాడు. అఖరికి వాడే చచ్చాడు. తాను రాజునయితే మాకు మంచి మంచి బహుమతులూ, పదవులూ ఇస్తానని ఆశ చూపాడు. అయితే, హఠాత్తుగా సముద్రం నుంచి రాకాసిమృగం రావడంతో హడలిపోయాం. దళనాయకుడు ఒక పూల కట్టను తీసి, దాని ముందుకు విసిరాడు. కాని ఆ రాకాసిమృగం, బ్రహ్మాండమైన తన చేతులతో పడవలను పట్టుకోబోయింది.





వికారమయిన మనిషి శవం అది. దానిని పరిశీలించి చూసిన ఉత్తుంగుడు, "ఇది రాకాసిమృగం మృతదేహం కావచ్చు! ఇక్కడ ఇద్దరు భటులు కాపలా ఉండండి. నేను రాజధానికి వెళ్ళి, ఈ సంగతి చెబుతాను," అని అక్కడి నుంచి బయలుదేరాడు.



అతడు రాజధానిలోని సేనాధిపతి ఇల్లు చేరేసరికి, సేనాధిపతితో పాటు కాబూయీ కూడా అక్కడే ఉన్నాడు. అతన్ని చూడగానే, "భటులు ప్రాణాలతో గట్టు చేరారా? దళనాయకుడేమయ్యాడు?" అని అడిగాడు సేనాధిపతి.

"దళనాయకుడు రాలేదు, ప్రభూ! అసలు ఏం జరిగిందో మీరే స్వయంగా వినండి," అంటూ భటుణ్ణి చూపాడు ఉత్తుంగుడు.

భటుడి ద్వారా జరిగినదానిని విన్న సేనాధిపతి, "దళనాయకుడు నాగసింహుడు జలసమాధి అయి వుంటాడనడంలో సందేహం లేదు. అయినా, అతడి మరణవార్త రాజుగారికి ఆనందం కలిగిస్తుందని చెప్పలేము. ఎంతయినా అతడు రాజబంధువు కదా!" అని, అక్కడినుంచి రాజు దగ్గరికి బయలుదేరాడు. మిగతావాళ్ళు ఆయనను అనుసరించారు.

ఉత్తుంగుడూ, భటుడూ చెప్పిన విషయాలను సేనాధిపతి రాజుకు తెలియజేశాడు. రాజు అంతా విని, తల పైకెత్తి, ఉత్తుంగుడితో, "మాణిక్యపురితో పాటు, మా రాజ్యాన్ని కూడా ఆపద నుంచి రక్షించిన నీ సాహసం మెచ్చ తగినది. నీ ధైర్యం యువకులందరికీ ఆదర్శమవుతుంది. నీకు సమ్మతమైతే మా సైన్యంలో దళనాయకుడి పదవి ఇస్తాం, చేరతావా?" అని అన్నాడు.

అంతలో సేనాధిపతి, "చక్కటి ఆలోచన, ప్రభూ! ఉత్తుంగుడు సైన్యంలో చేరాడంటే, ఇంతకాలం సైన్యంలో చేరడానికి విముఖులుగా వున్న కొండజాతి యువకులు కూడా చేరేఅవకాశం ఉన్నది," అన్నాడు ఉత్సాహంగా.

"ఉత్తుంగుడు దళనాయకుడయ్యాడంటే మాకందరికీ కూడా నాయకుడు కాగలడు!" అన్నాడు కాబూయీ ఆనందంగా.

ఉత్తుంగుడు కొంతసేపు మౌనంగా ఊరుకుని, "మీరు నాపైన చూపుతున్న అభిమానానికి కృతజ్ఞుణ్ణి! అయితే, నేను మాణిక్యపురి







నుంచి ఎందుకు బయలుదేరి వచ్చానో మీ కందరికీ తెలుసు. నా రాక కోసం నావాళ్ళు ఎదురుచూస్తూంటారు. నేను త్వరగా అక్కడికి చేరడానికి అనుమతించండి. మీ అభిమానాన్నీ, కరుణనూ ఎన్నటికీ మరిచిపోను, మహారాజా!" అన్నాడు వినయంగా.

రాజు ఉత్తుంగుడి చేతులు పట్టుకుని, "శభాష్, నీ మాతృదేశాభిమానం మెచ్చదగినది. నీ ఇష్టానుసారమే వెళ్ళు. అయితే ఈ రోజు కాదు; ఒక్కరోజు ఆగావంటే సకల మర్యాదలతో నిన్ను సాగనంపడానికి ఏర్పాటు చేస్తాను," అన్నాడు రాజు.

ఉత్తుంగుడు సరే అన్నట్టు తల ఊపాడు. కాబూయి, "తమరు అనుమతించారంటే, ఉత్తుంగుణ్ణి నేను మా గూడానికి వెంటబెట్టుకుని వెళ్ళి, మావాళ్ళకందరికీ చూపి వస్తాను," అన్నాడు.

"అలాగే, కాబూయి! రేపే పాటికి మీరిద్దరూ ఇక్కడ ఉండాలి," అన్నాడు రాజు.

"చిత్తం, మహారాజా!" అని చెప్పి కాబూయి అక్కడినుంచి ఉత్తుంగుణ్ణి వెంటబెట్టుకుని, గూడానికి బయలుదేరాడు.

వాళ్ళు గూడెం చేరగానే, వాళ్ళను చూడడానికి కాచుకుని వున్న స్త్రీ పురుషులు సంతోషంతో చప్పట్లు చరుస్తూ నాట్యం చేశారు. కాబూయి ఉత్తుంగుడి ప్రయాణం గురించి వాళ్ళకు చెప్పి, అతన్ని ఇంటికి తీసుకువెళ్ళాడు. కాబూయి భార్య ఇద్దరికీ విందు భోజనం ఏర్పాటు చేసింది.

ఉత్తుంగుడు ఆ రాత్రి అక్కడే పడుకుని బాగా నిద్రపోయాడు. మరునాడు తెల్లవారి లేచినప్పుడు, అతనికి వాకిట్లో, చిత్ర అప్పుడే నాటిన మొక్కకు నీళ్ళు పోస్తూ కనిపించింది. ఆ మొక్క తాను ఇచ్చినదే అని గ్రహించి, ఉత్తుంగుడు చిన్నగా నవ్వుతూ ఆమెను సమీపించాడు.

చిత్ర తల పైకెత్తి, "నువ్వు మాణిక్యపురికి వెళ్ళక తప్పదన్నమాట!" అన్నది.

"అవును, నాకోసం అక్కడ మావాళ్ళు కాచుకుని ఉంటారు," అన్నాడు ఉత్తుంగుడు తన మాటలు ఆమెకు ఎంతవరకు అర్థమవుతాయో అన్న అనుమానంతో.





"ఇక్కడికి తిరిగివచ్చి, మా సైన్యంలో దళనాయకుడివి కావచ్చు గదా?" అని అడిగింది చిత్ర.

ఉత్తుంగుడికి దళనాయకుడు అన్న మాట అర్థమయింది. ఆమె ప్రశ్న ఏమై వుంటుందో ఊహించి, తల అడ్డంగా ఊపాడు.

చిత్ర కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ ఇంటి లోపలికి వెళ్ళిపోయింది .ఆ తరవాత ఉత్తుంగుడు అందరికీ చేయెత్తి వీడ్కోలు చెప్పి కాబూయీ వెంట రాజధానికి బయలుదేరాడు.

రాజభవనం దగ్గర రాజు, ఉత్తుంగుడి రాక కోసం, తన పరివారంతో ఎదురుచూస్తున్నాడు. ఉత్తుంగుడూ, కాబూయీ రాజుకు నమస్కరించారు. రాజు వాళ్ళను సాదరంగా ఆహ్వానించి, కూర్చోమని ఆసనాలను చూపాడు. వాళ్ళు కూర్చున్న తరవాత సేనాధిపతి దుర్జయుడు లేచి నిలబడి, ఉత్తుంగుణ్ణి సభాసదులకు పరిచయం చేశాడు. సభికులందరూ ఉత్తుంగుణ్ణి ఆశ్చర్యంగా చూడసాగారు. ఉత్తుంగుడు వినయంగా లేచి నిలబడి సభకు గౌరవంగా నమస్కరించాడు. సభికుల కరతాళ ధ్వనులతో సభాప్రాంగణం మారుమోగింది.

ఆ తరవాత రాజు లేచి, ఉత్తుంగుణ్ణి సమీపించి, "ఉత్తుంగా! నీ సాహసం, మాతృదేశభక్తి బహుధా ప్రశంసనీయం. నిన్ను మన సారాఅభినందిస్తున్నాను,"అంటూ తన కంఠహారాన్ని తీసి అతని మెడలో వేసి ప్రేమతో కౌగిలించుకున్నాడు.



ఉత్తుంగుడు రాజుకూ, రాణికీ నమస్కరించి యువరాణి మల్లిక దగ్గరికి వెళ్ళగానే ఆమె, "రాకాసిమృగం నుంచి మా రాజ్యాన్ని కాపాడినందుకు ధన్యవాదాలు!" అన్నది.

ఉత్తుంగుడు చేతులెత్తి నమస్కరించి, సేనాధిపతి దగ్గరికి వచ్చాడు.

"రాకాసిమృగం మృతదేహాన్ని సముద్ర తీరంలోనే నిన్న భూస్థాపితం చేయించాం. నీకు తోడుగా రెండు పడవలలో మా సైనికులు మాణిక్యపురి వరకు వస్తారు. వాళ్ళు అప్పుడే సముద్రతీరం చేరారు. అక్కడ నీ కోసం ఎదురు చూస్తూంటారు. కాబూయీ, సముద్రతీరం వరకు వచ్చి సాగనంపుతాడు. నువ్వు ఇప్పుడే బయలుదేరవచ్చు. మీ రాజు



గారికి మా శుభాకాంక్షలు తెలియజెయ్యి," అన్నాడు సేనాధిపతి.

ఉత్తుంగుడు మరొకసారి సభికులందరికీ నమస్కరించి, కాబూయీ వెంట నడిచాడు. సభికులందరూ గౌరవంగా లేచి నిలబడ్డారు. కాబూయీ, ఆప్యాయంగా ఉత్తుంగుడి చేయి పట్టుకుని సముద్రతీరం కేసి బయలుదేరాడు.

వాళ్ళు సముద్రతీరం చేరేసరికి, అక్కడ ఉత్తుంగుడి పడవ, పూలతో అందంగా అలంకరించబడి ఉన్నది. పడవ నిండా ఏవేవో కానుకలూ, పళ్లూ ఉన్నాయి.

కాబూయీ కూతురు చిత్ర, స్నేహితురాళ్ళతో ఎదురువచ్చి, చేతిలోని శతాబ్దిక పుష్పాలను చూపుతూ, "సముద్రపు అలలు గట్టుకు చేర్చిన ఈ పుష్పాలను అక్కడే సేకరించాము," అన్నది నవ్వుతూ.

"అలాగా! వాటిలో కొన్నిటిని నా కానుకగా యువరాణి మల్లికకు ఇవ్వండి," అంటూ ఉత్తుంగుడు నవ్వుతూ పడవకేసి నడిచాడు.

కాబూయీ అతన్ని ఆఖరిసారిగా ఆప్యాయంగా కౌగిలించుకుని, పడవలోకి ఎక్కించాడు. అతడు కూర్చోగానే ఇద్దరు భటులు పడవను నీళ్ళలోకి తోశారు. అది ముందుకు వెళ్ళగానే రెండు పడవలలో కొందరు భటులు దానివెంట బయలుదేరారు. సాయంకాలానికి మూడు పడవలూ మాణిక్యపురి రాజ్యతీరాన్ని సమీపించాయి. వాటిని గమనించిన కాపలా భటులు ఆ సంగతి సేనాధిపతి గంభీరవర్మకు తెలియజేశారు. ఆ వార్తను కొందరు భటుల ద్వారా రాజుకు పంపి, సేనాధిపతి హుటాహుటిగా సముద్రతీరం చేరాడు. ఆయన వచ్చేసరికి ఉత్తుంగుడు పడవ నుంచి దిగి, ఎదురు వస్తూ, "రాకాసిమృగం మరణించింది!" అన్నాడు.

"నువ్వే దానిని హతమార్చావా?" అని అడిగాడు సేనాధిపతి నమ్మలేనట్టు.

"లేదు! ఆ సంగతి తరవాత వివరంగా చెబుతాను. మీరందరూ క్షేమమే కదా? రాజు, యువరాణి, మా చెల్లెలు క్షేమంగా ఉన్నారా?" అని అడిగాడు ఉత్తుంగుడు.

"అందరూ క్షేమంగా ఉన్నారు!" అంటూ సేనాధిపతి మాణిక్యపురి కేసి బయలుదేరాడు. ఆయనవెంట వెళుతూ రాకాసిమృగం ఎలా





మరణించిందీ వివరంగా చెప్పాడు ఉత్తుంగుడు. మాణిక్యపురి రాజభవనం ముందు రాజు ప్రతాపవర్మ, యువరాణి ప్రియంవద, ఉత్తుంగుడి చెల్లెలు రజని, ఉత్తుంగుడికి ఎదురు వచ్చారు.

"భైరంబీమాత నిన్ను రక్షించు గాక!" అంటూ రాజు ఉత్తుంగుడి చేయి అందుకుని భవనం లోపలికి నడిపించాడు.

"రాకాసిమృగం పీడ ఎలా విరగడయిందో నీ నుంచి స్వయంగా వినాలని ఉన్నది!" అన్నది యువరాణి ఉత్తుంగుడి వెనక నడుస్తూ.

"శుంభుణ్ణి రమ్మని కబురు చేశాను. అతడు త్వరలో రాగలడు," అంటూ రాజు ఉత్తుంగుడు కూర్చోవడానికి ఆసనం చూపి తనూ కూర్చున్నాడు.

మరునాడు రాజగురువు గౌరీనాథుడు వచ్చి, ఉత్తుంగుడు చెప్పినదంతా విని, "రాకాసిమృగం మరణంతో శతాబ్దిక పుష్పాలకు కలిగిన శాపం కూడా తొలగిపోయిందనడంలో సందేహం లేదు. ఇకపై ఆ పువ్వులు యేటా పూయగలవు!" అన్నాడు.

"ఇప్పుడు ఈ పూల మొక్కలను మన ఉద్యానవనంలో పెంచవచ్చు కదా, గురువర్యా!" అన్నది యువరాణి ఉత్సాహంగా.

"నిక్షేపంగా," అన్నాడు గౌరీనాథుడు మందహాసం చేస్తూ.

"అలాగే చెయ్యి, తల్లీ! మరొక్క మాట. విచిత్రపుష్పాలకు మించిన మరొక విలువైన బహుమతిని నీకు ఇవ్వాలనుకుంటున్నాను. తీసుకుంటావా?" అన్నాడు రాజు.

"ఏమిటి?" అన్నట్టు చూసింది ప్రియంవద ఆశ్చర్యంగా.

"నీకూ, ఉత్తుంగుడికీ వివాహం చేయాలనుకుంటున్నాను. ప్రజల రక్షణ కోసం ప్రాణాలకు తెగించి పోరాడిన ఉత్తుంగుడు నీ పాణిగ్రహణం చేయడానికి తగినవాడని భావిస్తున్నాను. నీకు సమ్మతమే కదా?" అన్నాడు రాజు.

ప్రియంవద సిగ్గుతో తల వంచుకుని, రజని చేయిని పట్టుకున్నది. రజని ఆనందంగా నవ్వుతూ ఆమె చేతిని తీసి, మందహాసం చేస్తూన్న అన్నయ్య ఉత్తుంగుడి చేతిలో పెట్టింది. — (అయిపోయింది)

